# సుగుణమణి

(వంగభాషా మాతృకననుసరించి వ్రాయబడినది)



శాంతినిలయ గ్రంథమాల

ప్రకాశకుడు:- ఆకుర్తి చలమయ్య

కాకినాడ.



వెల 1-4-0

## ఇది ఒక సాంఘిక చరిత్ర.

---

కథవలె, నవలవలె, చరిత్రవలె చదువతగిన గ్రంథము. మద్యపాన పిశాచమునకు బానిసయైన మానవుని కరుణా ప్రసాదముల చరిత్ర. సుగుణమణియొక్క అచంచలమైన, ప్రగాఢమైన పతిభక్తి, భర్తయొక్క క్రూరకృత్యములు, దారుణ దుష్ప్రవర్తన, పిల్లల అమాయకపలుకులు-వీనిని గురించి చదువుచున్నపుడు హృదయము చలించుచుండును, కన్నీరు గార్చవలసియుండును. ప్రతివారును తప్పక చదువ తగిన ఉత్తమ గ్రంథము.

# విషయసూచిక

## మనవి.

అనివార్య కారణములచే కొన్ని పరిచ్ఛేదములలో కొన్ని తప్పులు పడినవి. పాఠకులు మన్నించి దయతో సవరించుకొని చదువుకొందురు గాక!

ప్రకాశకుడు.

# సుగుణమణి

---

## ఒకటవ పరిచ్ఛేదము.

సుగుణమణి తండ్రికి ఒక్కతెయే కుమార్తె. ఆమె తండ్రి రాజారావుగారు చెన్నపట్టణములో ఒక రాజుగారి ఆస్తికి దివానుగా నుండెను, నెలకు రెండు వందల రూపాయల జీతము.

సుగుణమణికి పాపము తల్లిలేదు, పురిటి కాలముననే ఆమె చనిపోయినందున ఒక వృద్ధురాలగు దాసి సుగుణమణిని గారాబముతో లాలించి పాలనచేయుచు పెంచుచుండెను. సుగుణమణి ఆ దాసిని 'అక్కమ్మ'యని పిలచుచుండెను.

వయస్సు మీరిన తర్వాత భార్య చనిపోవుటచేత తిరిగి వివాహమాడిన యెడల సంభవింపబోయెడి కష్టసుఖములను గురించి చక్కగా ఆలోచించి రాజారావుగారు రెండవ పెండ్లి చేసుకోవాలనే తలంపును సంపూర్ణముగా మానివేసెను. కొంతకాలమయిన తర్వాత ఆయన తన కుమార్తెను సుగుణమణిని అతిబాల్యముననే ఒక బీదపిల్లవానికిచ్చి

వివాహము చేసి అతనిని తన యింటియందే యుంచుకొనెను. వివాహకాలమున సుగుణమణికి తగిన తెలివి తేటలుగాని తగిన యీడుగాని లేకుండుటచే, తన భర్తకు తనకుగల సంబంధమెట్టి దో, తనభర్త యెట్టివారో మొదలగు విషయములేవియు తెలి యకుండెను. భర్తపేరు కేశవరావు. అప్పటికాతను అమాయక స్వభావమును, బాల్య ప్రకృతియును గల పిల్లవాడు. వారిద్ద రును ఒకరునొకరు పేరు పెట్టుకొనియే పిలుచుకొనుచుందురు, ఒకటిగా నొకచోటచేరి ఆడుకొనుచుందురు. కేశవరావు బడికి వెళ్ళినపుడు సుగుణమణి వాని రాకకు నిరీక్షించుచు వీధి గుమ్మమువద్ద తరుచుగా తొంగి చూచుచుండును. బడినుండి ఇంటికి వచ్చిన తరువాత ఇద్దరును వసారాలో కూర్చుని వివిధ విషయములను గురించి ముచ్చటించుకొనుచు, ఒకరి పాఠ ముల నొకరు ఒప్పగించుకొనుచు, దారినిబోవు ప్రజాసమూ హమును చూచుచు, జట్కాబండ్లను లెక్కపెట్టుచు, కా లము గడుపుచుందురు. సాయంకాలమునకు రాజారావు గారు యింటికివచ్చిన వెంటనే ఇద్దరును ఆయన యెదుట కూర్చుని కొంచెముసేపు చదివి, తరువాత ఒక కంచములోనే భుజించి, అక్కమ్మ ఒడిలో పరుండి నిద్రింతురు.

సుగుణమణి కేశవుల బాల్యజీవిత మీవిధముగా గడచుచుండెను. వారి అన్యోన్య అనురాగము ఒండొంటితో అల్లుకొనిన మల్లికా పారిజాతముల యింపు సొంపుల నతిక్ర మించి అలరారుచుండెను.

ఇంతలో కేశవరావుకు విద్యార్థి దశగడచెను. రాజా రావుగారు అల్లునికొరకు వెచ్చించిన ధనమంతయు సఫల మాయెను. కేశవరావు మెట్రిక్యులేషన్ నుండి ఎం.ఏ.బి.ఎల్. వరకు సకల పరీక్షలందును అత్యంత ఖ్యాతితో కృతార్థుడయి ఒక సంవత్సరము గతించిన తరువాత బందరు జిల్లా కోర్టులో ప్లీడరు పని చేయనారంభించెను. అత్యల్పకాలములోనే అయనపేరు దేశమంతయు వ్యాపించెను. నెలకు మూడు వం దలకుపైగా రాబడి వచ్చుచుండెను. ప్రజల దృష్టి ఆయనపై నిలిచి నేరముల కేసులలో అందరును ఆయనవద్దకే వచ్చు చుండిరి. భాగ్యవంతులందరును పెద్ద పెద్ద ప్లీడర్ల వద్దకు వెళ్ళుట మానివేసిరి. కేశవరావు సుగుణమణిని ఇప్పుడు తన యింటికి తీసుకొని వచ్చుటకు మొహరమ్ శలవులలో చెన్నపట్నము వెళ్ళెను.

రాజారావుగారికి భార్యలేదు. సుగుణమణి తక్క మఱి యే స్త్రీపురుష సంతానమును ఆయనకు కలుగలేదు. అనేక సంవత్సరముల నుండి జమీన్దారుగారి కచేరీలో న్యాయ ముగా ఉద్యోగము చేసి పది రూపాయలు తెచ్చుకొనుచుం డెను. కేశవుడు, విద్యాసమాప్తి చేసిన పిమ్మట ఇల్లరికముండి చెన్నపట్నములోనే ఏదో ఒక ఆఫీసులో ఉద్యోగము చేయ వలయునని రాజారావుగారి కోరికయై యుండెను, అతడు శాంతగుణయుతుడై పెద్దల మాటయన్న జవదాటువాడు గాకున్నను, అతని స్వభావములో ఒక గొప్పదోషముండెను.

తన కేదితోచునో దానినే చేయునుగాని యితని యిష్టమునకు విరుద్ధముగా ఎవరేమి చెప్పినను సహించు నాచార మతని యందుండగూడదు. కేశవుడు మామగారిని భక్తి శ్రద్ధలతో తండ్రివలెచూచుచు మనఃపూర్వకముగా ప్రేమించుచుండెను. కాని, ఉద్యోగము చేయుటకు ఆతనికి అసహ్యమగుటయేగాక చిరకాలము మామగారి యింట దాసుడై యుండుటకు ఇష్టములేకుండెను. కేశవుని విద్యాసంపదయు, నిష్కళంక మైన స్వభావమును, అతనికెచ్చటనున్నను వన్నెదెచ్చునవిగా నుండెను. అతనిని జూచి ఎవ్వరైనను క్రొత్తవారు కొంచెము సేపు సంభాషణము జరిపినయెడల, వెంటనే ఆతని సత్స్వభా వమును గ్రహించినవారై ఎంతకాలమైనను ముచ్చటలాడు చుండగోరి చివరకాతని సాంగత్యమును వదలలేక వదలలేక వదలి వెళ్ళుచుందురు. కేశవరావు ప్లీడరు పని చేయుట కారం భించినపుడు మామగారికి నిరసనపూర్వకముగా ఉత్త రము వ్రాయుటచేత, రాజారావుగారు మిక్కిలి దుఃఖితుడ య్యెనుగాని కుపితుడు మాత్రముగాక, అల్లుని పేరుప్రతిష్ఠ లు వ్యాపించువఱకును ఆతని ఖర్చునిమిత్తము డబ్బు పంపు చునేయుండెను. కాని ఆరు మాసముల తర్వాత వకీలు పనిలో చాలా ధనము గణించుట కారంభించుటచేత కేసవ రావుగారు మామగారి సహాయముపొందుట మానివైచిరి.

సుగుణమణి ప్రయాణసన్నాహ మగునపుడు రాజా రావుగారు దుఃఖాక్రాంతుడై కంట దడిపెట్టసాగెను. సుగుణ

మునీ తన్నేల వదలి వెళ్ళవలెను? తాను గడించిన ధనము
తోనే ఆమె జీవనము ఏలోటును లేక సుఖముగా జరుగదా!
అయ్యో! పిచ్చి! ధన మాంసోకోర్కెల నన్నింటిని తీర్పగలు
గునా? భర్త నెడబాసి తండ్రియొద్దనుండుట కామె పాతి
మైనను అంగీకరించునా? సుగుణామణికి ఒక వేళ ఇష్టములేకున్నని
అనుకొన్నను తండ్రి దానిని ప్రోత్సాహించుట తగునా?
రాజారావుగారు దీర్ఘముగ నాలోచించి తండ్రియయినను,
స్వార్థపరత్వముచే తన లాభముకొరకు కుమార్తె సుఖ
మున కష్టమువచ్చుట అనుచితమని తెలిసికొని ఆమె ప్రయా
ణమున కన్నియు సిద్ధపఱచి, దుఃఖావేశముచే 'అమ్మా!
వెళ్ళుము. దైవసాక్షిగ నిన్ను నీ భర్తకు సమర్పించియుంటిని
నీవిప్పు డాతనియొద్దకే వెళ్ళుము" అని ప్రక్కకుతిరిగి హీన
స్వరముతో పలుకసాగెను. కన్నీటి ప్రవాహముచే ఆయన
రొమ్ము అంతయు తడిసి ముద్దఆయెను.

తండ్రి యీవిధమున వెక్కి వెక్కి యేడ్చుచున్నప్పుడే
సుగుణామణియు ఇంకొక గదిలో కూర్చుని లోలోపల దుఃఖిం
చుచుండెను. ఆమెకు రెండు వైపుల సంకటమయ్యెను. ఒక
వైపున తండ్రి, మరి ఒకవైపున భర్త. అక్కటా! చిన్ననాట
నుండియు తల్లిలేని బిడ్డను ఆదరపూర్వకముగా పెంచిన
తండ్రిని వదలవలసివచ్చెను. తల్లి స్వర్గస్థురాలైనప్పటినుండి
యును తండ్రికి ఉపచారములు ఆమెయే చేయుచుండెను.
భోజనసమయమున ఆమెదగ్గర లేనియెడల తండ్రి తృప్తితో

తిన్నదినమే లేదని చెప్పవచ్చును. కావున సమయమున సుగుణమణి పాదసేవచేయునదే తండ్రి నిద్రింపడు. "రేపు నాన్నగారియొద్ద కూర్చుండి అన్నము తినిపించువారెవరు? జబ్బుచేసినా ఆయనకు సేవజేయు రెవరు? అని మిగుల తలపోయుచుండ దుఃఖము ఆగక పొంగి పొరలుచుండెను.

వివాహమైనప్పటినుండియు ఒక సంవత్సరము వఱకు కేశవరావుగారు చెన్నపట్టణములోనే ఉండుటచేత సుగుణమణి దినములు అధికసుఖసంతోషములతో గడచెనుగాని, తరువాత ఆయన ప్లీడరుపని చేయుటకు స్థానాంతరము వెళ్ళినప్పటినుండియు! ఆతనియొద్దనుండి ఉత్తరమువచ్చుట యేమాత్రమైన ఆలస్యమయ్యెనేని పెనిమిటి యెట్లుండెనోయని చింతించుచుండును. ఆమె దుఃఖమునకు కారణము అప్పుడు పెనిమిటి; ఇప్పుడు తండ్రి; వార్ధక్యమునందున్న జనకుని ఒంటరిగా వదలుటకు ప్రాణము పరితపించుచుండెను. తన కెప్పుడును సర్వసుఖములనుభవించుభాగ్య ముండదని ఆలోచించుచు ఆలోచించుచు సుగుణమణి నిద్రపోయి ప్రాతఃకాలమునలేచి వెక్కి వెక్కి యేడ్చుచు తండ్రికి నమస్కరించి పెనిమిటితో ప్రయాణమై వెడలిపోయెను.

———(:o:)———

*

# సుగుణమణి

## రెండవ పరిచ్ఛేదము.

మనము ముందు పరిచ్ఛేదమును వదలిన తరువాత అయిదు సంవత్సరములు గడచిపోయెను. ఈలోపల సుగుణమణికి ఇద్దరు పిల్లలు కలిగిరి. పిల్లల అన్నప్రాశనమునకు రాజారావుగారు అల్లుని గృహమునకు వచ్చెను. సుగుణమణియు రెండు పర్యాయములు పుట్టినింటికి వెళ్ళెను. ఇంకను అక్కడ కూర్చున్నయెడల ఇచట సంసారము సాగదుగదా! ఇంటిపెత్తనమంతయు తనచేతిలోనే యుండుటచే, తానొక్క రోజు లేకున్నయెడల ఇల్లంతయు గల్లంతగుటయేగాక, కేశవరావుగారు కోర్టుకు వెళ్ళుటకూడ మఱతురు. ఆయనపని ధనము గడించుటయే; సంపాదనమును ఖర్చుపెట్టి యిల్లంతయు చక్కబెట్టునది సుగుణమణి.

కేశవరావుగారి రాబడి నానాటికి వృద్ధియగుటయేగాక, క్లబ్బులో అందరును ఆయనను ధార్మికుఁడనియు సత్యవంతుఁడనియు వేనోళ్ళ పొగడుచుండిరి. ఒక్క ప్లీడరు పనియేగాక ఆయన యింకను కొన్ని సర్కారువారి పనులుగూడా చేయుచుండెను. ఆయనయె మ్యునిసిపల్ చేర్మన్, ఆయనయే డిస్ట్రిక్టుబోర్డు వైస్‌ప్రెసిడెంటు; ఆనరరీ మెజస్ట్రీటును, హితకారిణీసభకు కార్యదర్శియు ఆయనయే, ఏదైన

నొక సత్కార్యము చేయవలెనన్న, ఆయన ముఖ్యముగా నుండవలెను; ఏదైననొక సభ జరిగినయెడల ఆయనయే దానికి ప్రధానకర్త? అన్నిటికిని కేశవరావుగారే; ఆయన లేని యెడల ఏపనిగాని నిర్విఘ్నముగా కొనసాగనట్లుండెను.

సుగుణమణి దినములిట్లు గడచుచుండెను గాని సౌఖ్యమెల్లకాలముండునా! పాదరసమువలె ప్రకాశించు నిర్మలమైన ఆకాశమున నల్లని కాలమేఘమొకటి పొడసూపెను. కొద్ది రోజులకే కేశవరావుగారు రోగపీడితులైరి. పిలిచినను పిలువకున్నను ఆయనమీఁదనున్న గౌరవముచేత ఆపట్టణములోనున్న యింగ్లీషు నేటివ్ వైద్యులందరును దర్శనమిచ్చి నాడీ పరీక్ష చేసి. రోగమూలమును గనిపెట్టి ఔషధమిచ్చుచుండిరి గాని, వ్యాధి యేమాత్రము నుపశమించక దినదినము వృద్ధి చెందుచుండెను. మిక్కిలి పలుకుబడి గలవారగుటచే ఊరివారందరు కూడ మిగుల ఖిన్నులైరి. ఎట్లో నెలరోజులు గడచెను; తరువాత కొద్దిగా తగ్గుముఖము చూపెను. ఇంకనేమియు భయము లేకున్నను రోగవిముక్తుఁడగునప్పటికి ఇంకొక మాసము పట్టెను.

మూఁడు మాసముల తరువాత కేశవరావుగారు ఇంట్లోనుండి బైటికి కాలుపెట్టగలిగిరి. బంధుమిత్రులకును, ఇరుగుపొరుగు వారికిని పండుగవలెనుండెను; సుగుణమణియు పురోహితుని పిలిపించి, సదనుష్ఠాన వ్రతముజేసి, గుడ్డికుంటి వాండ్రకు కూడ నాహారమొసగి కృతార్థురాలయ్యెను.

కేశవరావుగారికి నాటికి ఆరోగ్యము కలిగినను, శరీరము మిక్కిలి దుర్బలమై ఆకలితగ్గెను. అందుచే వైద్యులు భోజనమునకు పూర్వము ఒక ఉద్ధరిణెడు చొప్పున బ్రాంది పుచ్చుకొమ్మని సలహా యిచ్చిరి. బ్రాందికిని కేశవరావుగారికిని చాలదూరము; కాని ఔషధార్థము సురాపానము చేయుట నిర్దోషమే గాక, ఆరోగ్యవిషయములో అట్లు చేయకుండుటయే పాపమనుకొని, ఆ నియమ ప్రకారముగా పుచ్చుకొనుచుండెను. శరీరము క్రమముగా స్వస్థతజెందెను. ఇదిగో, అదిగో, అనుచు నాలుగుమాసములు గడిచెనుగాని, "బ్రాంది" మాత్రము ఇంకను మానలేదు; దానియందలి పూర్వమున్న అనిచ్ఛాభావము తగ్గెను. ఇప్పుడు రెండు పూటలు పుచ్చుకొన పోయినను రాత్రియే రెండు పర్యాయములంత పుచ్చుకొనుచుండెను. మునుపు పంచపాత్రలో కొంచమెక్కువగా పడినదానిని తిరిగి బుడ్డిలో పోయుచుండిరి గాని యిప్పుడు అది ఉదరములోనే పడుచుండెను. పరిమాణమును పూర్వమువలెగాక యుద్ధరిణెల దాటెను. మునుపు బుడ్డి యిరువదినాలుగు ఇరువదియైదు రోజులు వచ్చునుండగా ఇప్పుడు నెలకు మూడైనను సరిపోవుటలేదు.

పాపము సుగుణమణి తనకు వాటిల్లు దురవస్థ నింకను తెలిసికొనలేక పోయెను. నాడు గాన్పించిన కాఱుమేఘము ఘనీభూతమై వచ్చుచుండెను.. బ్రాందికిని కేశవరావుగారికిని చెలిమి వృద్ధియగుటచే ఆయన దానిని వదలలేకుండుటయే

గాక కొద్దితో తృప్తిలేకుండెను. బైట, కచ్చేరీ చావడిలో ఆఫీసు వ్రాతకోతలన్నియు ముగియగనే అందఱును వెడలి పోయిన పిమ్మట ఆయన యించుక బ్రాందితాగి లోపలికి వెళ్ళి భుజించి పరుండుట యలవాటు.

ఒక రోజు రాత్రి చాలపొద్దుపోయెను. అప్పటికిని కేశవరావుగారు లోనికి రాలేదు. సుగుణమణి ఆహార సామగ్రి నంతను అమర్చిపెట్టి దీపమునెదుట కూర్చుండి చదువుకొను చుండగా చావడిలో నౌకరు ఏడ్పు వినబడెను. తత్తరపాటుతో కిటికీ తెరచిచూడగా పెనిమిటి తిట్టరాని తిట్లతో తిట్టుచు నౌకరును కొట్టుచుండెను. నౌకరును కొట్టుట ఎట్లుండనిమ్ము. కేశవరావుగారు ఎన్నడైనను ఎవ్వరినిగాని ఒక్కమాట అని యెఱుగమిచే సుగుణమణి ఆవింత నేమాత్రమును గ్రహింప లేక నిశ్చేష్టితురాలయ్యెను, మఱియొక క్షణమునకు భర్త లోనికిరాగా నేత్రములు రక్తవర్ణమై పాదములు వణకు చుండెను.

ఆరోజు కేశవరావుగారు తన క్లయింటు వ్యాజ్యెములో ఓడిపోగా మిక్కిలి వ్యసనముతో ఇంటికి చేరిరి. ఏమియు తోచ కుండుటచే కచేరిచావడినుండి అందఱును లేచి వెళ్ళినతోడనే నౌకరుచే బుడ్డి తెప్పించుకొని మామూలుకంటె రెండింతలు త్రాగి, వెంటనే ఎక్కిన నిషాలో నమలుటకు పొగాకునిచ్చుట కొంచెమాలస్యమయ్యెనను మిష మీద బంట్రోతునుకొట్టి, తిట్టు

టకు పూనకొనెను. సుగుణమణికి ఇది యేమాత్రమును తెలి
యక పోవుటచే నౌకరును సంగతి యేమియని యడుగుటయు,
భర్త మండిపడి నోటికి వచ్చినట్లెల్లను ఆమెనుకూడ తిట్టి,
నాకు మామగారు రాజారావుగారు తనను, ఇల్లరకపు అల్లు
నిగ నుండుమనుట నేను జ్ఞప్తికిదెచ్చుకొని ఆయననుకూడ ఎత్తి
పొడిచి, చివరకు అన్నమంతయు నిల్లంత వెదజల్లి, వెండికం
చము నొక తన్నుతన్ని వెళ్ళి పరుండెను.

పెనిమిటి తననిట్లు దూషించుట ఇదియే మొదటి
పర్యాయము. తనకును తన తండ్రికిని వాటిల్లిన అవమాన
మును సహింపలేక రెండు జాములవరకు ఏడ్చి యేడ్చి భర్త
నెట్లు సారానుండి మరల్చుకొనాయను దీర్ఘచింతతో నామె
యారాత్రి గడచెను. ఆరోజు సుగుణమణికి నిద్రియే లేదు.

మఱుచటిదినము ఉదయముననే కేశవుడు నిద్రనుండి
లేచి మంచము ప్రక్కనే నిలిచియున్న భార్యను చూచి కడ
చిన రాత్రి జరిగిన సంగతులన్నియు జ్ఞప్తికి రాగా మిగులలజ్జచే
నామె ముఖము జూడలేక త్వరితగతిని పడకనుండి దిగి తన
ఆఫీస్ గదిలోకి వెళ్ళి, పెట్టెను తెరచి వెంటనే నౌకరు చేతిలో
రెండు రూపాయలు పెట్టి రాత్రి జరిగిన సంగతు లేమాత్రము
ను ఎవరికిగాని చెప్పకుండునట్లు అంగీకరింపజేసెను.

ఆహా! ఈదినము అతనికి శాంతియుండునా! తాను
చేసిన దుష్కర్మమును దలపోయుచు, నికనెట్లు సుగుణమణి

తన ముఖమును చూపుకునాయని యేడ్చుచు, కోర్టులో ఆరోజు తన కేసులుండగా సెలవు దీసికొని, కొంచెము ధైర్యము తెచ్చుకొని తిరిగి శయనమందిరము ప్రవేశించి, తన ప్రియురాలి హస్తద్వయమును పట్టుకొని, ఇట్లనెను: 'ప్రియా'! ఈరోజున నిన్నెంత యవమాన పఱచితిని! నన్ను క్షమియింపుము. నాకింక నరకాగ్నియే ప్రాప్తి! నన్నే విధమునైన రక్షింపకలుగుటకు త్వరపడుము."

సుగుణమణి గుడ్లనిండ నీళ్ళుగ్రుక్కుకొనుచు ప్రియుని తన ప్రక్క కూర్చుండ సూచించి,—'ఇక బ్రాంది త్రాగకు,' డని హీనస్వరముతో నుడివెను.

కేశవుడు—నేను త్రాగకుండగ ఉండలేను.

సుగుణమణి మునుపు త్రాగుబోతుతనము మీకు లేదుగదా! అప్పుడంతయు చక్కగానుండెను, ఇప్పుడేందుచేత ఉండలేరో నాకు తెలియకున్నది? మీరు సారాయి వదలిపెట్టి తీరవలెను. ఒక దినములో మానలేనియెడల క్రమముగా మానగలరు,

కేశవుడు—నీవన్నట్లు ఒకదినములో మానలేనుగాని క్రమముగా వదలివేయగలనని అనుకుంటున్నాను.

**సుగుణమణి**—ఎప్పుడును నీకుఁ తెలియకుండఁగ బ్రాంది త్రాగనని నాయెదుట ప్రతిజ్ఞ చేయుఁడు. నేనే మీకు ప్రతిరోజు కొలిచి యిచ్చి క్రమేణ మాన్పిచెదను.

**కేశవుఁడు**—ఆందులకు అంగీకరించెను. **సుగుణమణికి** హృదయమునుండి కొంతబరువు తగ్గినట్లాయెను. అంధకారా చ్ఛన్నమైన యామె మనోనురాగములు కొంత తెఱిపి యిచ్చి వికసింప నారంభించెను; వెంటనె ఆమెయెదుటనున్న బ్రాంది బుడ్లను, గ్లాసులను లోనికిఁ దెప్పించి, పనిమిటికి స్నానము చేయు నీళ్ళు తోడియిచ్చి భోజన మిడి కోర్టునకు పంపెను.

---

# సు గు ణ మ ణి

## మూఁడవ పరిచ్ఛేదము

**కేశవుఁడు**—ఇక చాటుగా త్రాగుట మానివేసిరి. కాని, ఇంటిలో ఆయన భార్య భోజనమునకు పూర్వమిచ్చు నట్టి స్వల్పమును త్రాగి తృప్తిచెందక, కొన్నాళ్ళుజరిగినపిమ్మ ట తాను ప్రతిదినము పుచ్చుకొనుచున్న సారాయిపరిమాణ ము తక్కువగుచున్నదని విసుగుకొనుచు తుదకు మఱికొంచె మియ్యమని భార్యను పీడింపసాగెను.

"నాకు ఈవేళ మిక్కిలి జబ్బుగానున్నది. ఈరోజున తప్పక కొంచెమెక్కువ సారాయి యిచ్చితీరవలెను" అని కేశవుడు నుడివినవెంటనే, సుగుణమణి "ఒకక్క చుక్కయైనను ఎక్కువయియ్యను. నేను మీకు సహధర్మిణినైయుండి నా చేతులతోనే మీకు ఈవిషమును ఇయ్యవలసినట్టి నిర్భాగ్య దశ పట్టినది. మీరు నా చేతులతో సారాయికొల్చి పోయునపుడు నకు ఎంత కష్టముగా నుండునో మీకేమాత్రము తెలియదు" అని నుడివెను. కేశవుడు "సారాయి త్రాగినందు వలన ఎవడును చావడు; అంతెగాక నియమానుసారము గా త్రాగిన ఎడల శరీరము ఆరోగ్యము చెందును. నేను చనిపోవుటకు సిద్ధముగానున్నపుడు ఇంత బ్రాందిత్రాగి బ్రతుకుటయు అప్పటినుండి యీసంవత్సరము ప్రతిరోజు పుచ్చుకొని ఏమియు రోగములేక సుఖముగా ఉండుటయు నీవెఱుగవా?"

సుగుణమణి—"మీరు నియమానుసారముగా పుచ్చుకొనుచున్నంత నేను ఇచ్చుచున్నాను. ఈరోజు ఎక్కువ ఎందుకు?"

కేశవుడు—"ఒకటి రెండు రోజులు కొంచెము ఎక్కువ త్రాగినచో ఇంతలోనే ఎవరైనా చచ్చిపోదురా ?

సుగుణమణి—"తప్పక హానికలుగును, సందేహము లేదు. కొంచెము కొంచెము ఎక్కువగా త్రాగుచుండినచో

పరిమాణ మెక్కువగును. చివరకు మీరు త్రాగుబోతగుదు రని మిక్కిలి భయపడుచున్నాను."

ఆరోజున ఎక్కువ మద్యము త్రాగ అధిక ఇచ్ఛకలిగి యుండుటచే భార్య మాట లతనికి విషమువలెనుండెను. "నా విషయమై నీకు అత్యంత నీచాభిప్రాయము గలదు, నాకు రాత్రి నిద్రపట్టలేదు. మద్యపానమందుగల దోషాదోషములు నీకంటె బాగుగనే ఎఱుగుదును. నీవింక నధిక ప్రసంగము చేయకుము, నేను త్రాగుబోతునైన నా జ్ఞానమానములు నశించిన నీకున్నంత మాత్రము సిగ్గు నాకును గలదు." అని భర్త నుడువుటయు, సుగుణమణి యేమియు మాటాడలేక తెల్లబోయి నిలుచుండెను పెనిమిటి మాటలవలన గుండెలో రాయిపడెను.

కేశవుడింకను సారాయి కోరుటచే సుగుణమణి పోసికొని త్రాగుడని చెప్పుచు అగదియందుండి వెడలి పో యెను. ఆయన సురాభ్రమచే తన ఇష్టమువచ్చినంత విషము పానము జేసెను, ఆనాటి రాత్రియంతయు అతడు భార్యకు కనుపడనేలేదు.

సుగుణమణి యేమిచేయుటకును తోచక మరునటి దినము బ్రాందిబుడ్డిలో కొంచెము నీరుకలిపి యుంచి రాత్రి భర్త భోజనము చేయవచ్చినపుడు మొదట మామూలు ప్రి

కారము ఒకగిన్నెడు ఇచ్చెను. తిరిగి కోరఁగా ఆరోజు మఱి యొక గిన్నెడు మాఱుమాట్లాడకయే ఇయ్యగా, కేశవుడు సారాఘాంటు తగ్గినట్లుగను, భార్య తనను మోసపుచ్చుచున్న ట్లుగను వెంటనే తెలిసికొని, ఎఱుగనట్లుండి ఆమెకు తగు ప్రాయశ్చిత్తము చేయుటకై మరునాఁడు తానే ఒక బుడ్డెడు బ్రాంది కొని తనగదిలోని అల్మారులో పెట్టి తాళమువేసి నౌకరుతో ఆసంగతి ఆమెకు చెప్పవద్దని వాగ్దానము చేయించు కొనెను. తరువాత రాత్రి యథాగా భోజనమునకు పూర్వము ఒకటి రెండు గిన్నెలు పుచ్చుకొని వచ్చెను. సుగుణమణి మరల సారాయిలో కొంచెము నీళ్ళుకలిపి యిచ్చెను. ఆయన దానినికూడ త్రాగి, మరల కోరక మాఱుపలుకక ఊరకుం డెను. ఈప్రకారము నాలుగైదురోజులు గడచి గడవక పూర్వమే రహస్యముగా పెనిమిటి త్రాగుచుండుట యామె యు కనిపెట్టి యాసంగతి భర్తకు తెలియనియ్యకుండెను.

వీరి ఇంటిలోనిసంగతు లిట్లుండఁగా బందరుపురవాసు లందఱును తమకు రాబర్టుసన్ పేటనుండి బందరు కోటకు రాకపోకలు ఇబ్బందిగానున్న వనియు వర్తకము వృద్ధియైన కొలఁదిని అచటికి అనుదినమును వెళ్ళు జనసంఖ్య అధిక మగుచున్నదనియు, అందుచే, తమ కనుకూలముగ రైలు రోడ్డును కోటవఱకు వ్యాపింపజేయువలెననియు, అడానిడి చేయుచు గవర్నమెంటువారి కర్జీపెట్టుకొనుటకై 'నోబిల్ కాలేజి హాలులో ఒకసభ నాహ్వానము జేసిరి. ఈరోజు

సాయంకాలము అయిదు ఘంటలకు సదరు సభ జరుగునని యు, కేశవరావు గారు ఉపన్యాస మిత్తురనియు చాటింపించి ఊరంతటను ప్రకటనపత్రికలను పంచిపెట్టిరి. కాని కేశవరావు గారు సాయంకాలము నాలుగుఘంటలకు కోర్టునుండి శ్రమ పడి వచ్చుటచే మిగుల బడలిక చెంది ఒక్క గ్లాసెడు సారా పుచ్చుకొనన కోరికకలవాడై వెంటనే ఆకార్యమునకు పూను కొనెను. ఎదుట బల్లమీద నిలబడియున్న "సురాదేవి" ఆయన మనస్సును ఆకర్షించుటచేత తాను ఉపన్యాసము నీయ వలసియున్నదనియు, ఆవిషయమై యిదివరకే తన సమ్మతి తెలిపియున్నాడనియు పూర్తిగా మఱచిపోయి ఒక్క పర్యా యము పానముచేసెను. మరియొకసారి పానముచేయ ఆపేక్ష కలిగెను. ఇక తాగినగాని చేతిలోని కలము జరుగకుండుటచే రెండవ పర్యాయము త్రాగెను. ఇంకొక సారికూడ, ముఖ్య ముగా మూడు సారులు పూర్తియయ్యెను.

ఆవైపున సభాప్రారంభసమయము సమీపముగావచ్చెను. సభా స్థలములో జనులు కిటకిటలాడుచు నిండియుండిరి. కేశవరావు నుద్దేశించి సభ్యులందఱును రోస్ట్రమువైపునకు తేరిపారచూచు చుండగనే రాత్రి ఎనిమిది ఘంటలయ్యెను. అప్పటికిని ఆయన రాకుండుటచే ఇంటికి కబురు పంపగా వెంటనే బంట్రోతు లోనికి వెళ్ళి యుపన్యాసస్థలమునుండి పిలుపు వచ్చినదని చెప్పి నపుడు చైతన్యవంతుడై తెలివి తెచ్చుకొని బండి కొఱకు మనుష్యుని పంపి తానును లేచి, తనకు తృప్తికలుగునట్లుగా

మరియొక సారి గ్లాసెడు పానముచేసి పొట్టనింపుకొని ప్రయాణమయ్యెను. ఎడ్లు పరుగిడుచుండెను. సభాస్థానికి చేరునప్పటికి కేశవరావుగారు ఆయన దేహానికి పరిపూర్ణముగా వశీభూతుడగుటచే బండినుండి దిగుటకైనను శక్తి లేకుండెను. ఎట్లెట్లో పట్టుకొని నడిపించి ఆయనను సభాస్థలమునకు జేర్చిరి. పాపమపుడు ఉపన్యాసమీయుటకు లేవగా తూలి క్రిందపడుటచే, నోటినుండి నురగలు గ్రక్కసాగను.

కేశవుడు త్రాగుబోతు అయినట్లు ఈరోజే అందరికిని స్పష్టముగ తెలిసెను. పూత చారిత్రుడైన కేశవరావుగారిట్లు అధోగతి పాలగుదురని కలలోనైనను ఎవ్వరును తలంచలేదు. సభాసదులందరును నిశ్చేష్టితులైరి. కొందరు క్షోభను, కొందరు దుఃఖమును, కొందరు కోపమును, కొందరు ఆనందమును ప్రకటించుచు ఎవరి యిండ్లకు వారు మెల్లగ వెడలి పోయిరి.

మరునాడు ఉదయమున ప్లీడరుగారు మామూలు ప్రకారము కచ్చేరి చావడిలో కూర్చుండి తన పార్టీల కేసులు వినలేకుండెను. సిగ్గుచే సగముచచ్చి తలవంచుకొని ప్రక్క గదిలో తలుపు బిగించుకొని కొంతసేపు పరుండియు, కొంతసేపు కూర్చుండియు, కొంతసేపు పచార్లు చేసియు, కాలము గడుపుచుండెను. వెయ్యితేళ్ళు ఒక్కసారిగ చురుక్కుమని కుట్టుచున్నట్లుండెను, ఇట్టి స్థితిలో తనసుఖమే ఆమె సుఖము

గాను, తన సౌఖ్యమే ఆమె సౌఖ్యముగాను, తలంచుకొనుచు
యావజ్జీవమును సహచారిణియైయున్న తన సుగుణమణిని
ఒక్కమారు కౌగలించుకొని, ప్రేమసూత్రమును ఒక్కరాగ
ముతో బంధించుకొని మనశ్శాంతి నొందవలెనని, ఒక్కొక్కసారి
యిచ్ఛకలుగుచుండెను; కాని ఆరోజులు గతించి చాలదినము
లయ్యెను. ఇంటిలోనికి వెళ్ళుటకు సాహసము లేదు. మనస్తా
పము చల్లబడకుండుటచే తిరిగి నాగబుద్ధినెత్తి ఆవిషముతోనే
తనపొట్టను నింప నారంభించెను. తనసృష్టి అధోలోకమునకు
దెచ్చి, నల్వురలోను తలవంపులపాలుచేసిన 'సుగాదేవి' నే
తిరిగి యారోజున సక్రమముగా పూజాద్రవ్యములతో పూజించి
హృదయ ఫలకమందు ప్రతిష్ఠించి శేషించి ఉన్న గౌరవమును
గూడ నైవేద్యమిచ్చి రాక్షస రూపముదాల్చెను.

గత రాత్రియందు సుగుణమణి భర్తయవస్థయంతయు
కన్నులార చూచి, మఱునాటి యుదయమున బాత్రోతుచు
దాసిని అడిగి సభావృత్తాంతము తయు దెలిసికొని ఇక నీజన్మ
ములో తనకు సుఖము లేదనియు; భర్త బాగుపడెడి ఆశ బొత్తి
గా పోయినదనియు; తలపోయుచు తలపోయుచు ఆత్మహత్య
జేసికొన నిశ్చయించుకొనెను, కాని కొలదిరోజుల క్రిందటనే
తనకు మూడవ శిశువు జన్మించుటచే తాను మరణించిన యె
డల ఈ ముగ్గురు పిల్లలేమగుదురోయను భావనతో యదినము
నెట్లో గడచిపోయెను.

ఆనాడు కేశవు డాహారమును గ్రహింపకుండెను. సుగుణమణినికూడ ఎవ్వరు కొంచమైన అన్నము తినిపించ లేక పోయిరి. రెండవనాడు మొదటి బిడ్డడు తండ్రివెంటబడి "నానా! అమ్మకు జబ్బుగా నున్నది. అమ్మ దొర్లి దొర్లి యేడ్చుచున్నది, చూచెదవుగాని రా" అనుచు పలుకసాగెను. కాని 'నాన్న' కిప్పుడు మనుష్యత్వ మెక్కడిది! పశుప్రకంటు అధముడు. హృదయము పాషాణకాఠిన్యము వహించెను. తండ్రి యేమియు పలుకకుండుటచే, ఆకుఱ్ఱడేమియు గ్రహింప లేక. నిన్నటివఱకు నాన్న మెడచుట్టు చేతులువేసి మీసములు లాగుచు కన్నులను బొడుచుచు ముద్దుగుడిచినట్లె యీరోజు నను చేయబోవ, ఆయన యీడ్చి ఒక చెంపదెబ్బ వేసి పంపి వేసెను. పాప మప్పుడా పసిబాలుడు తల్లిచెంతచేరి ఏడ్చి యేడ్చి దుఃఖావేశముచే క్లాంతిచెందెను. ప్రథమ దినమువ లెనే ద్వితీయదినమును గడచెను. ఈరోజుకూడ కేశవుడు బైటికే రాలేకపోయెను.

మూడవనాడు ఉదయమున సుగుణమణి నిద్రనుండి లేచి శోకాతిశయముచే గుండెలు దడదడ మన, అతిదుఃఖ ముచే మనశ్శరీరములు దుర్బలముకాగా, కాళ్ళువడక, తల తిరుగుచుండ పసిపిల్లను చంక నిడికొని గబగబ లేచివచ్చి వసారాలో చతికలబడి ఇంచుకసేపు భావిజీవిత భావనలోని మగ్నురాలయ్యెను కాని, దుఃఖము ఆగక పొర్లిపొర్లి వచ్చు టచే తన పెనిమిటి గదిలో కవాటము బంధించుకొని కూర్చు

న్నట్లు గ్రహించి, ఇంచుక ముందునకు నడిచి దబదబ తలుపు తట్టి తీయునంతవరకును తలకాయ తలుపునవేసి కొట్టికొని లోపల ప్రవేశించెను. ఒకరిముఖము నొకను జూచుకొనిరి. ఒకరికిని నోటివెంట మాట రాకుండెను. కాని యించుకసేపూరకుండి భర్త యీ మూడుదినములలో పూర్తిగ రూపుమాఱి యుండుటయు, కళ్లు గుంటలు పడుటయు, ముఖము నల్లనై యుంటయు గనిపెట్టి, యిక నాలస్యముచేసిన లాభములేదని తెలిసికొని వెంటనే తలుపు గొళ్ళెము పెట్టి పెనిమిటి పాదములు రెండును బట్టుకొని నారాయి వదలిపెట్టుమని నయవినయములతో అనేకవిధముల బతిమాలుకొనెను. "ఒక్కపర్యాయము ముఖమెత్తి సూటిగా ముగ్గురిపిల్లల వంకజూడుడి! కానున్నది అయినది, అయినను ఇప్పుడైన జాగ్రతపడిన యెడల సమస్తము చక్కబడును. అన్నివిధముల సర్దుకొని పోవునని యింక అనేకవిధముల తెలియచెప్పుచు ధైర్య సాహసములను పురికొల్పెను" అని కేశవుడు మాఱుమాట్లాడక మౌనావలంబియై యూరకుండెను.

---

# సుగుణమణి

## నాల్గవ పరిచ్ఛేదము

---

తరువాత ఆరుమాసములు గతించెను. సిరి సంపదలు సుగుణమణిని విడిచి పోయెను. ఇప్పుడు సురాపానుని కేశవుని పట్టుకొని వేధించుచున్నది. ఇంతవఱకును ఆయనచుట్టు చేరి యుండిన మర్యాదస్థులగు స్నేహితులును, ఆయన నెఱిగియుండిన పెద్దమనుష్యులును, ఇప్పుడు ఎడమైపోయిరి. భోగము వాండ్రును తప్పద్రాగి వీధులంబోబడి దొర్లు దొమ్మరివాండ్రును పరమాప్తులయిరి. రాత్రిందినములలో ఒక్క నిమిషమైనను మనుష్యజ్ఞానము లేకుండయుండెను. కోర్టునకు వెళ్ళుట ఏడాడికి ఒకపర్యాయము! ఇక, పార్టీలెవ్వరును ఇంటికివచ్చుట లేదని వేఱుగ జెప్పవలెనా? మునుపు నెలకు నాలుగు వందలు, అయిదువందలు, ఈలాగువచ్చురాబడికి ఇప్పుడు పదిరూపాయలో ఇరువది రూపాయలో వచ్చినయెడల అదే చాల గొప్పగానుండెను. బండి గుఱ్ఱమును అమ్మివేసెను. బాజారులో ఏకొట్టులో చూచినను నూర్లు, నూటయేబదులు పెరిగి ఉండెను! ఇప్పుడు కోమట్లకుగూడ తెలివివచ్చినది; అప్పిచ్చుట మానివేసిరి. అద్దెకిచ్చిన యింటివారుకూడ ఈసంగతి అంతయు కనిపెట్టి లేచిపొమ్మని ముందు నోటీసు ఇచ్చిరి.

ఇల్లుదిద్దుభారము పూర్వము సుగుణమణి మీదనుండె నని వినియుంటిమిగదా. ఇప్పుడునుఅంతే. ఆమె ఒంటిమీద ఇప్పుడు ఒక నగయైనను లేదు. అన్నియు తాకట్టులోనే ఉన్నవి. పిల్లలకు మొలకుచుట్టుటకు ఒక్కగుడ్డముక్కయైనను లేకపోవుటచే, ఆగాగే ఆచిరుగుగుడ్డలే గట్టుచుండెను. మునుపు ఇంటిలో ముగ్గురువంటకర్లు, ఇద్దరుదాసీలు, ఒకవంట లక్క యింకను చాలసిబ్బందియుండెను. ఇప్పుడు అందరు మెల్లమెల్లగా ఒకరితరువాత ఒకరు జారిపోయిరి. అయినను ఒక్కదాసీమాత్రము పాపము దయదలచి నిలువబడి తనచేత నైన పనిని తాను చేసిపోవుచుండెను, తక్కిన చాకిరీనంతయు సుగుణమణి స్వయముగా చేసికొనవలసివచ్చెను. పగలు రాత్రి యీప్రకారముగా ఈడ్చుకొనుచు బండచాకిరీ చేయు టచే పాపమామె చిక్కి శల్యమాయెను.

కేశవుని పేరుప్రతిష్టలు మంచిచెడ్డలు ఆ ఆరునెలల నాడే అడుగంటినవి; మునుపు సంసార పాశములలో చిక్కి ముక్తికొఱకు తన్నుకొనుచుండెనుగాని, ఇప్పుడు పూర్ణజ్ఞాని యైయ్యెను, భార్యబిడ్డలమీాద ఇప్పుడు ఆ 'మాయ' మమత పోయినది; ఇప్పుడు సంసారగోష్టియే లేక ద్వంద్వాతీతుడయి, ఇంతసారాయితాగి పొట్టనింపుకొని అప్పుడప్పుడు వైకుంఠ దర్శనము చేసివచ్చుచుండును. బండిగుఱ్ఱము లమ్మగవచ్చిన డబ్బు అయిపోగా ఇప్పుడు మంచిమంచి విలువగల 'లా'

కోడ్డులు, పుస్తకములు అయినసరికి సగముకో, ఇంకను ఆధర
రాకపోయిన నలుగవంతుకో తెగనమ్మి మద్యపాన చేష్టు
డగుచుండెను. సారాంగుకాణమే ఆయనకిప్పుడు అత్యంత ఆధార
మాయెను. జ్ఞానులకు గృహామేల? నెలలో సగమురోజులు
ఆయన ఎక్కడ తిరుగుచుండునో ఎవరికిని తెలియదు సరేగదా
మీదు మిక్కిలి సుగుణమణి ప్రతిరోజును రాత్రులందు
ముగ్గురిపిల్లలను చుట్టవేసకొని ఆతాపసుని కొరకు వేచియుండ
వలసి వచ్చుచుండెను.

ఇట్లుండగా ఒకనాడు కొంచెము ప్రొద్దెక్కెను. పిల్ల
లకు అన్నము లేదు; వండుటకు బియ్యములేవు; రెండు
జాములు దాటి మూడవజాముకూడ దాటవచ్చుచుండెను.
చిన్నపిల్లవాడు ఆకలిబాధచే పొత్తికడుపు వెన్నెముకనంట,
గిలగిల తన్నుకొనుచుండెను; పాపము సుగుణమణి ఒకనాటై
నను తిన్నగా అన్నములేకుండుటచే నామెరొమ్ము ఎండి
పోయెను, ఈవైపున గొల్లమనిషి చాలడబ్బు బాకియున్నదని
సణుగుచు పాలు పోయుట మానివేసెను. అందుచే ఇదివరకు
తనకునగలు చేసియిచ్చు కంసాలియింటికే ఇప్పుడు తన
రెండుజతల బంగరుమురుగులను అమ్మకముకు పంపి యీ
లోగా పెట్టియడుగున ఒకరూపాయ కనుపించగా గబగబ
గొల్లమ్మని పిలువదాసినంపి తానారూకను చేతబట్టుకొని
వెట్రిదానివలె దొడ్డిలో తులసికోటమీద కూర్చుండి పిల్లల
ప్రాణము దక్కెగదా యని తలపోయుచుండెను. ఇట్టి సమ
యమున కేశవుడు ఎదురుగా ప్రత్యక్షమయ్యెను.

ఎన్నాళ్ళనుండియో అతడు సుగుణమణి చెంతకే రా లేదు. ఆమెపై ప్రసక్తియే లేకుండెను. ఈరోజు మాత్రము అదృష్టవశాత్తు ఆమె ప్రక్కను గూర్చుండి చిన్న బాలుని నెత్తు కొని ముద్దాడ సాగెను. పాపము! సుగుణమణికి ఇంత మా త్రముననే ఒళ్ళుపొంగ పరమానంద భరితురాలయ్యెను.

కాని మనము మాత్రము ఆయన పశ్చాత్తాపముచే అను తాపమునొంది ఇకనైనను బుద్ధికలిగి ఉండవలెనను ఉద్దేశ ముతో ఇంటికివచ్చెనని అనుకొనగూడదు. పుస్తకాలమ్మిన డబ్బంతయు త్రాగుబోతులును, కల్లంగడివాండ్రును వదలింపగా నిన్నటిరాత్రినుండి ఆహారలేమిచే కడుపుకాలగా భార్యవద్ద ఏమైననుండిన దానిని తాను వదలింపవలెనని యింటికివచ్చెను; తిరిగి యింతపిండము వేయుటకు ఆమెయే గతియగుటచే, తినుటకేమైనను పెట్టుమని అడుగసాగెను. ఆమెవద్ద ఒక రూ పాయి మాత్రమే యుండుటయు, ఆరూపాయిని గొల్లమ్మకిచ్చి బాలునిప్రాణము నిలుపుటకై ఆగొల్లమనిషికొఱకు దాసిని పంపుటయు మన మిప్పుడే చదివియుంటిమిగదా! కాని ఆమెకు భర్తమీదనుండు గాఢప్రేమచే ఆసంగతినంతయు మఱచి ఒక రూపాయి యున్నదిగాని కొనితెచ్చుటకు దాసీ అయినను ఇంటలేదామెననెను. ఇదియేసందుగదా అని హరేంద్రుడు "అదియెప్పుడువచ్చునో? నా కడుపులో మలమల మాడుచు న్నది; నేను కొనితెచ్చుకొందును, ఆ రూ పా యి నా కే యియ్యి" మనగా, సుగుణమణి ఆరూకను వెనుకముందా

లోచింపక వెంటనే ఆయనచేతిలో పెట్టెను. పెట్టుటయు, అతడు మరల మాట్లాడకుండ కుమారుని వెంటనే క్రిందికిదించి ఆనందచిత్తుడై యారోజుకు బ్రతుకు జీవుడా అనుకొనుచు పరుగిడిపోయెను. ఇంతలో అతడట్లు దాటగనే యావైపున గొల్లది ప్రత్యక్షమయ్యెను, ఏమిచేయుచున్నది? ఆయనదికాని మ్మని యాగొల్లదాని రెండుచేతులు బట్టుకొని 'అమ్మా! నా రెండు మురుగుల జతలను ఇప్పుడే తాకట్టుకు పంపితిని; ఆడబ్బు వచ్చినతోనే ముందు నీ అప్పుతీర్చి మరియొకపని చేసి కొనియెదను. ఇంతలో నీకు కావలెనంటే నేనేమి చేయుదును? అప్పుపోయ్యేట మాత్రము మానకు, అమ్మామానకు; ఇట్టు వంటప్పుడు నీవుకొంచెము దయజూపకపోతే నాచిన్న పిల్ల వాడు బ్రతికెడి ఉపాయములేదని పలువిధముల బతిమాలు కొనగా ఆగొల్లమనిషి గుండెకరిగి జాలిపడి ఆ యింట నెన్నాళ్ళనుండియో పడి తిననిదేయగుటచే 'ఆసరేలే' అని ఆరోజుకు పోసిపోయెను.

అప్పుడు సుగుణమణికి కొంచెము ధైర్యము రాగా, పాలు వెచ్చబెట్టుటకు లేచుచున్నంతలో పెద్దకుర్రవాడు 'అమ్మా! నీకు ఉత్తరమువచ్చెనని చెప్పుచు ఒక కవరును తెచ్చియియ్యగా విప్పిచూచుకొనగా తండ్రి రాజారావుగారు ఇట్లని వ్రాసిరి:—

చెన్నపట్నము.

అమ్మా, సుగుణమణీ

నీవద్దనుంచి చాలారోజులనుండి పుత్తరము వచ్చుట లేదు. నేను రెండు మూడు పుత్తరములను వ్రాసితిని. వాటికైనను జవాబు వ్రాయలేదు. నామీద కోపమువచ్చినదా యేమి? లేక నన్ను సాఫుగా మరచి పోయినావా? నిన్నొకసారి చూడవలెనని నాప్రాణము తపించుచున్నది, సెలవుకు నిన్ననే దరఖాస్తు పెట్టినాను. దొరికినతోడనేవచ్చి నిన్ను చూచెదను. అదిగాక నెలరోజులపాటు నిన్నక్కడికి తీసుకరావలెనని కూడనున్నది. పిల్లలునీవు బాగాయున్నసంగతి పుత్తరము వ్రాయుము.

తండ్రి

రాజారావు.

తండ్రివచ్చునని విన్నతోడనే సుగుణమణి గుండెలు చల్లబడెను. మనకిది ఆశ్చర్యముగా తోచవచ్చునుగాని వెనుక రెండవ కుట్టువాని అన్నప్రాశనమునకు వచ్చినప్పుడు ఆమెసంసార మెట్లుండెనో ఇప్పుడెట్లున్నదో యించుక విచారించిన మనకే తెలియును. అప్పుడు సుగుణమణి యింటిలక్ష్మి కలకలలాడుచుండెను. మనస్సునకు హాయియుండెను; ముఖమందు కళయునాట్యమాడుచుండెను, అప్పుడు నలుగురితో తలయెత్తి మాటాడుటకు వీలుండెను. ఇప్పుడో!

అయ్యో! అన్నియు పోయెనుగదా! లక్ష్మి వదలిపోయినది, ముఖమందు దరిద్రపుకళ. మనసునకు సుఖములేదు. నిమిష ములో ఎట్టిమార్పు! ఈపదిపండ్రెండు నెలలలో నామొయవస్థ యెట్లాయెను! తలచుకొనిన గుండెలు కొట్టుకొనక మానవు, కళ్ళవెంట నీరు గారకమానదు! పతియా భ్రష్టుడయ్యె, పిల్ల లకా, కట్టుకొనుటకు గుడ్డలేదు, తినుటకా అన్నములేదు, సం సారమానట్టిల్లయ్యె, సంతోషమా అనాడే అంతరించిపోయి నది. హా మద్యమా! నీమహిమ యేమనిచెప్పనగును! ఇట్టి అవస్థయందు తలయెత్తి తండ్రినిజూడవలెనన్న ఎట్లుండునో చదువరులే భావించుకొందురుగాక! అందుచేతనే పాపము, సుగుణమణి నాన్నకు రావలదని ఉత్తరము వ్రాయవలెనను కొనెనుగాని. వ్రాయుదమనుకొనుచుండగనే రోజులుగడచి పోయెను.

ఇట్లుండ సుగుణమణి వద్దనుండి జవాబు రాకుండుటచే రాజారావుగారికేమియు తోచక సెలవుదొరికిన మఱునాడే బయలుదేరి రెండవనాడు సాయంకాలము బందరులో ఏడు గంటల రైలుమీద దిగి కూతురు యింటికివచ్చెను. మెల్లకి- సింహద్వారమున ప్రవేశించిచూడ, మంచిదీపమైనను లేదా యెను; మిణుకుమిణుకుమనుచు నల్లని పొగబారిన కిరసినబుడ్డి దీపమొకటి ఏమూలనో యుండియుయుండనట్లుండెను' అం దులో ఆయనకు చత్వారము. ఇకచెప్పవలెనా? అసలే గం పెడు దిగులుతో వచ్చెను; పైగా ఈపరిస్థితులు; ఎట్లయినను తప్పనిసరియగుటచే అటులనే కళ్లుచించుకొని నలుదిక్కులు

చూడగా ఆకచేరిచావడి నిజస్వరూప మప్పుడు బైటపడెను. ముందర నిర్జనము, ఆతివాసీలు లేవు, ఆబల్లలు, ఆకుర్చీలు, ఆ అల్మారాలు కానరావు, ఒకమూలనుండి కప్పలు బెకబెక శబ్దము వినిపించుచుండెను. చుంచులు, ఎలుకలు, పందికొక్కులు నిటునటు పరుగిడుచు స్వేచ్ఛాసంచారము చేయుచుండెను; అడుగుతీసి అడుగిడునంతలోనె యీమూలనుండి ఆ మూలకును, ఈతలుపునుండి ఆతలుపునకును, ఈగోడనుండి ఆగోడకును, అల్లుకొనిన సాలెగూళ్ళు మొగమునిండ ముక్కునిండ చుట్టుకొని ఊపిరియాడకుండ చేసెను. త్రోవకడ్డముగా పెట్టబడి దుమ్ములో నిండిన కోళ్ళువిరిగిన పాతబెంచిమాత్ర మొకటి ఉండగా అదికూడ ఆయన మోకాలి కే తగిలి ప్రాణము జిల్లార్చుకొనిపోయెను. ఈయవస్థ అంతయుచూచి కొంచెము నిలువబడి అల్లుడీ గృహమునుండి మఱియొక గృహముకు వెళ్ళెనని అనుకొనునంతలోనే లోపల పిల్లలమాటలు వినబడి, అయినను చూతమని వెంటనే పెద్దమనుమని పేరు పెట్టి పిలువగా సుగుణమణి గ్రహించి గబగబ రెండు పాత గుడ్డలను ఇద్దరి పిల్లలకును కాస్తింతచుట్టి మీతాతగారు వచ్చినారు చూచిరమ్మని బైటికిపంపెను. పంపి తానును కొంచెము మర్యాద నిలుపుకొనుటకును, అదిగాక తండ్రికి యీయవస్తను కొంతవరకైనను మఱుగుజేయుటకును పెట్టెయడుగున ఒకమాత్రము తెలుపుగుడ్డ ఒకట్టియే యుండగా దానినితీసి కట్టుకొని యిటునటు సర్దుకొనుచుండెను. మనఘనుడు కేశవుడు అపుడు ఇంట్లో లేడని వేఱుగ చెప్పవలెనా?

తరువాత ఆయన ఆచీకటి కొట్టులోనే ఇంచుక సేపు పిల్లలతో తాతామనుమని వరుసలాడి, పిమ్మట ఇద్దరిని చెరి యొకచేత పట్టుకొని లోనికిరాగా, సుగుణమణి తండ్రికి నమస్కరించి కూర్చుంటకు పీటవేసెను. ఆయనయు ప్రయాణ బడలికచే వెంటనే చతికిలబడి కుమార్తెకళ తగ్గి సల్లబడి బొమికల బొమ్మయగుటయు, అలంకార విహీనురాలై ఒక ప్రాతచీరకట్టుకొని రెండు మట్టిగాజుముక్కలు చేతిందొడుగు కొని యుండుటచూచి తెల్లబోయి 'అమ్మాయేమది? నిన్ను గుర్తించుటకైనను వీలులేకున్నది, ఎందుచేత నిటుచిక్కినావు? సంగతియేమి?" అని యడుగగా ఆమె "ఏమోనాన్నా ఏమిటో నాకేతోచకుండవుంది. బొత్తిగా అన్నహితవు తప్పవది, ఒక్క మెతుకైనా లోపలికి పోకున్నాన్నా!" అని చెప్పుచు వంట-యింటిలోనికి వెళ్ళి పాదప్రక్షాళనమునకు ఇత్తడిచెంబుతో చెంబెడునీళ్ళు తెచ్చియిచ్చెను. దానినందుకొని రాజారావు గారు 'అమ్మా నీపిల్లలేరి ?, అనిఅడుగ పుత్రిక "వాళ్ళేవరు ఇప్పుడు లేరు, ఆడుటకు వెళ్ళిపోయినారు" అని జవాబు చెప్పెను.

రాజా —"దాసీ మనిషేది?"

సుగు—"నీకుకొంచెము ఫలహారము కొని తెమ్మని బజారుకుపంపినాను."

రాజా—"కచేరిచావడిలో అలాదుమ్ముకొట్టుకొనిఉన్న
దేమి? మళ్ళీచూడబోతే పెద్దప్లీడరుగారియిల్లు కూర్చుండుట
కైనా ఒక్కతివాసీ ముక్కఅయినా లేదు."

పాపము సుగుణమణి గుట్టుబయటపడకుండ చేయవలె
నని అనుకొనినను ఒకటితరువాత ఒకటి అన్నియుతానే తెలియ
జెప్పుట చూచుకొని యింతమాత్రము మనోనిశ్చయమైన లేదు
గదా దైవమా అని కడువిలపించెను. తరువాత తండ్రి గుచ్చి
గుచ్చి యెన్నియోసంగతులడుగ ఆమె యిక దేనికిని సరిగా
జవాబు చెప్పకున్నను, కుమార్తె సంసారమంతయు ఏకారణ
ముచేతనో సర్వనాశనమైనదని మాత్రము ఆయన పూర్తిగ
గ్రహించెను. ఇంతలోపల దాసి బజారునుండి రాగా ఆయనకా
ఫలహారమొసగి, తనచేతితోనే పక్క వేసి, 'నాయనా కొంచె
ముసేపు పడుకొని శ్రమదీర్చుకొనుమని జెప్పుచు, తానువంట
చేయుటకు వెళ్ళెను.

సుగుణమణి అట్లువెళ్ళగనే రాజారావుగారు పిల్లల
నిమిత్తమై తానుతెచ్చిన లక్కబొమ్మలను, లక్కపిడతలను,
మఱియు యితరములయిన ఆటవస్తువులను బయిటికితీసి వారల
కానుకగ నిచ్చెను. తండ్రి అనేకదినములనుండి పిల్లల జోక్య
మే కలుగజేసికొనకుండుటచేతను, తల్లితప్ప తమనాదరించి
ప్రేమించువారిని ఇంతవరకు చూడకుండుటచేతను, నేటి ఈ
తాతగారి ఆదరగౌరవములు గాంచి అచ్చెరువొంది ఉబ్బిపో

యిరి. ఆయన వారలతో కలసి ఆడుకొనుచు మధ్యమధ్య సందుజేసికొని కేశవునివిషయమై అనేక అనేకసంగతుల నడి గెనుగాని రాంబ్రదది మిక్కిలి చిన్నతనముగుటచే దానికివి సరి యైన జవాబులియ్యలేక పోయిరి. అయినను, ఆయన తన పెద్దమనుమనితో జరిపినసల్లాపమును ఇంచుక మాచదువరు లకు తెలియజేసెదము. పెద్దవానిపేరు 'సుకుమారరావు', రెండవ మనుమనిపేరు 'సదానందరావు', మూడవ వానికింకను నామకరణము చేయలేదు.

రాజారావుగారు—"సుకుమారా! మీనాన్నకు నిన్నుచూస్తే యిష్టమేనా!"

సుకుమార—"లేదుతాతా! మరే! ఒక మాటే. అమ్మకు జబ్బుచేసింది, పడుకొని యేడుస్తుంటేను నాన్నను పిలుస్తామని గదిలోకి వెళ్ళాను; మరే వెడితేను, ఒకచెంప దెబ్బేసి నెట్టేసిపొమ్మన్నాడు?

రా—"మీనాన్న మిమ్ములను ఎప్పుడైనా ఎత్తు కుంటాడా?"

సు—"ఊహు, లేదు"

రా—"చిన్నతమ్ముణ్ణో?"

సు—"ఎవ్వర్నీ ఎత్తుకోడు."

రా—"మీబండి గిండి ఏమైనవి?"

సు—"మానాన్న అమ్మేసినాడు"

రా—"మీనాన్న కచేరీకి వెళ్ళడమా మరి?,,

సు—"ఏమో నాకు తెలియదు?,,

రా—"మీనాన్న ఏగదిలో పడుకుంటాడు?,

సు—"మరే! పగలెప్పుడూరానేరాడు; రాత్రిళ్ళు ఎప్పుడైనా వస్తేనే ఊహలరికే తిడుతుంటాడు?,

రా—"ఏమని?,

సు—"ఏమో?,

రా—"మీయింటికెవరూ పెద్దపెద్దతలగుడ్డలు పెట్టు కొని కోట్లు తొడుక్కొని రారూమరి?,

సు—"మరే! అదేమోగాని, ఎప్పుడైనా మానాన్న తోనే రాత్రిళ్ళు ఎవళ్ళోవచ్చి ఆడుతారు; సంగీతంపాడుతారు.,,

రా—"నీకు ఎన్నిలాగులున్నయి."

సు—"ఒక టేగా?"

సదానంద మింతవఱకును తాతగారిచ్చిన వస్తువులతో ఆడుకొనుచుండెనుగాని 'లాగుల' మాటవినఁబడినవెంటనే ఆటనదలి, "మళ్ళే, నాకో ఎల్ల-లాగుఉంజి; అమ్మిచ్చింజి."

రా—"మీకు బూష్సు లేవు!"

సు—"ఋహూ! పాడై పోయినయ్"

సదా—"నాకు బూచ్సు తెచ్చి పెత్తవ్ తాతా?",

రాజారావుగారు రాముడ్ని మాటలువిని ఇంక ఆగలేక వానిని ఒడిలోనికి లాగుకొని ఒకటి ముద్దిడి కొని "ఆమాట అడగవలెనా' తాతా! బూచ్సుయిత్తాను, లాగులుకుట్టించి పెడుతాను.

సు—"నాకో"

రా—"నీకూను, మిమ్మన్ని మాప్రూరుకూడా తీసుకొని వెడుతాను"

సదా—" తాతా! నేవొత్తా నీతో."

రా—"జా! మీరిద్దరూ వస్తారు, తమ్ముడొస్తాడు, అమ్మొస్తుంది".

సు—"నాన్నో మరి"

రాజా రావుగారామాటకేమియు జవాబియ్యక తిరిగి "అమ్మ మీకేమిమితాయి పెడుతుంది" అని అడిగెను.

సు—"అమ్మో, మరమరాలు పెడుతుంది."

సదా—"ఏను, బొలుగులు తింతాగా రోజూనూ?"

రా—"పకోడీలు నీకిష్టం లేదూ?"

సు—"అమ్మకొనిపెట్టదుగా, నాకు."

సదా—"నాకు పకోడీలు కొనిపెత్తవు తాతా?"

రా—"కొనిపెడతా, తాతా! రేపొద్దున్నే కొని పెడుతా, పాలుతాగుతున్నారా?"

సు—"అమ్మ మాకియ్యదు తాతా! బుల్లితమ్మునికి మట్టుకి ఇస్తుంది. మాకింకో టాయిల్లాయిస్తుంది."

రా—"యేమిటిది?"

సు—"మరే, అన్నంఉడగ్గానేను, కుండలోనుంచే, ఏమిటో తెల్లతెల్లగ వంచుతుంది; ఆ వేడివేడిదాంట్లోను ఉప్పేసి ఇస్తుంది; యీవేళ నీకూడాయిస్తుందిలే."

రాజారావు గా మాటలువిని కళ్ళనుండి నీళ్ళు బొట బొట కార మఱి పలుకరింపలేక యూరకుండెను. ఇంతలోనే పిల్లలిద్దఱును నిద్రావశులైరి.

సుగుణమణి తన చేతిమురుగులను అమ్మినటచే ఇప్పుడిల్లు చక్కగ గడచుచుండెను. ఈరోజు తండ్రిరాకచే బజారునుండి నాలుగైదుకూరలు తెప్పించి విరివిగా వంటచేసెను. తిరిగి ఈదినమున దగ్గరకూర్చుండి నాన్నకు అన్నముతినిపించు సుయోగము లభించెగదాయని సంతోషించుచు వెనుకటి సంగతులనన్నిటిని ఒకటితరువాత నొకటి జ్ఞప్తికి తెచ్చుకొనెను, సాధారణముగా జనులుకోరుకొను కోరికలన్నియు ఆమెకుఆనాయందు సులభసాధ్యములయియుండెను, మాణిక్యమువంటి పెనిమిటి దొరకెను. భార్యభర్తలకిద్దఱకిని ప్రేమానుబంధము దట్టమైయుండెను. భార్యయెడల భర్తకుప్రీతియు, భర్తయెడల భార్యకు భక్తియు అతిశయిల్లుచుండెను. ఏవరినోట చూచినను సుగుణమణికేశవులు చిలుకగోరువంకవలె ఎంతహాయిగ నున్నారు? అనియె చెప్పుకొనుచుండిరి. అట్టి సంసారమిప్పుడు చితికిపోయెను గదా! కటకటా! దైవమా! ఏలఇట్లు చేసితివి? మనసార పెంపొందించిన అపారప్రేమను ఇట్లేల చేతులారా

చెల్లాచెదఱుగ చెదఱ గొట్టితివో నివెయెఱుంగుదువు గదా! సుగుణమణి కిప్పుడెంతటి దౌర్భాగ్య స్థితిసంభవించెను.

కడచిన రెండుమూడు రోజులనుండి సుగుణమణి యొద్ద కొంచెము డబ్బు ఉండుటచూచి దానిని వదలింపవలెనని కేశవుడు సమయము కొరకు చూచుచుండెను. సుగుణమణి పెనిమిటి అడిగినపు డెల్లను కొంచముగనో గొప్పగనో యిచ్చుచునే ఉండెనుగాని యింతవకు పూర్తిగ సున్నజుట్టలేదు. కాని నిన్నటిరాత్రి ఆయన రెండురూపాయల నడుగగా ఆమె పిల్లల నోటివద్ద గ్రాసముదీసి దుర్మార్గుడగు భర్తకు త్రాగ నియ్యజాలక నిరాకరించెను. అందుచే ఆమెపై అప్పుడేదెబ్బలుపడెను. నేడును అట్లే వచ్చి తండ్రికన్నుల యెదుటనే అవమానపరచు నేమోయను భయముతో "హా! దైవమా! ఈరోజునైన ఆయన సహజావస్థలో ఇంటికివచ్చు గాత!" అని కడు విలపించెను.

అట్లే తలపోయుచు వంటజేయునప్పటికి నడురేయియయ్యెను. రాజారావుగారు ప్రయాణయాఆసముచే బడలికగొని నిద్రించుటచే కుమార్తె వెళ్ళి, లేపి, కట్టుకొన పట్టువస్త్రమిచ్చి అన్నమువడ్డించి తాను ఎదుటనే చతికిలబడెను. విస్తరి ఇరు పార్శ్వములను కూరలు పచ్చళ్ళు వడ్డించి యుండుటజూచి 'అమ్మా! నాకొరకు-నీకొరకింత కష్టపడనేల? ఇన్నివడ్డించినను నాకా తాయిల్లమును గనుపర్చకయే పోతివిగదా!

'ఏమిటది నాన్నా?'

"రోజురోజును పిల్లలకు పాలకుబదలు చద్దికుండనుండి వేడివేడి నీళ్ళుగార్చి యింతఉప్పువేసి యిత్తువుగదా. అదినాకును ఇంతయియ్యగూడదా! నేను చేసుకొన్న పాపమేమి?'

సుగుణమణి మిన్నకుండెను.

"అమ్మా! నేను పట్నములో గూర్చుండి పంచభక్ష్య పరమాన్నములతో చూదిపేళములు, హెూళీలు, అరిసెలు హాయిగ తినుచుండ నీపిల్లలకిక్కడ నింతపాలకైన గతిలేక గంజిబోయుచుంటివా! ఒక్క చీటిముక్క యైన వ్రాయవైతివిగదే తల్లీ! ఏలయిట్లయ్యెనో, ఉన్నది ఉన్నట్లుగ పూసగుచ్చినట్లు చెప్పుము."

"సిగ్గులేక ఏమనిచెప్పుకొను, నాన్నా! చేసినపాప ఫలము ననుభవించి తీరవలెనుగదా! ఆమాయత్రాగుడే మమ్మింతజేసినది." ఉస్సురని ఒక్క నిట్టూర్పునిగిడ్చి, "హాదైవమా! మాణిక్యమువంటి నాముద్దు బిడ్డలకింత రెండవపూట మెతుకుకైన గతిలేకుండజేసితివిగదా!" అనుచు విలవిల ఏడవసాగెను."

తరువాత అనేకవిషయములను గూర్చి ముచ్చటించిరి. ఆయన పిల్లలను కుమార్తెను పట్నము దీసుకొనివెళ్ళునట్లు

సూచించుచుండెను. ఇట్టిసమయమున దబదబ తలుపుతట్టిన ధ్వనియు, దానివెంటనే సుగుణా, అను పిలుపును వినబడెను. పెనిమిటిగొంతుక గుర్తించి అయ్యో! పూర్తిగా త్రాగియే వున్నట్లున్నదనుకొనుచు తలుపుదీసి, "మామామగారు వచ్చి నారు." ఈరోజుననయిన మామర్యాదనుగ పాడుకొని నా మానమును గాపాడుడని రెండుచేతులు బట్టుకొని ప్రార్థించెను.

కాని ఆయన సుగుణమణి అనుకొన్నట్లు పూర్తిగ త్రాగియుండుట వాస్తవమేఅగుటచే, ఆమెమాటలు చెవి కెక్కక కొంగున ఒకరూపాయి ముడిఉండుటచూచి దాని నిమ్మని అడిగెను. ఆమెవద్ద ఇంకఎంతో పైకము లేమింజేసి దానినియ్య నంగీకరింపలేదు. ఆకారణముచేత ఆమెను తన యిష్టమువచ్చినట్లెల్ల కర్ణకఠోరమగు పదములతో తిట్టి తనచేతి యందున్న దుడ్డుకర్రతో కొట్టనారంభిచెను, రాజారావుగారు తిట్లు చెవినబడగనే విస్తరి వదలి లేచివచ్చి కింకర్తవ్యమని ఆలోచించుచు నిలిచియుండెను. కాని కొట్టనారంభించిన తోడనే అల్లునిచేతినుండి ఆకఱ్ఱనులాగుకొని ఆడుదానినిగొట్ట సిగ్గులేదాయనుచు పరిపరివిధముల చీవాట్లు పెట్టెను. చిన్న నాటనుండి మామగారి ఆధీనములో పెరిగినను, తనవిద్యా బుద్ధులకు ఆయనయే కారణమయినను, అజ్ఞాన మేమాత్ర మునులేక తానును తిట్లతో తనవరుస దీర్చుకొనుటయేగాక, మామమిక్కిలి ఆయనను చెప్పుదెబ్బలతో పూజింపవలెనని కాలినుండి జోడుతీయుటకు పాదమెత్తెను. తానొకటి చేయ

దలచుకొన్న దైవమొకటిచేయునని పెద్దలు చెప్పినమాట వృథయగునా? మత్తుచే కాలెత్తి యెత్తగనే తూలి తలక్రిందుగ నేలకూలెను.

ఇట్లీగాత్రిగడిచెను. దీనినంతన చూచి విస్మయమందిన రాజారావుగారిఅవస్థను, సుగుణమణి దుఃఖమును మాచవలె గాని గ్రహింపశక్యముగాదు. కేశవుడు తెల్లవారువరకును సగము మత్తుతోను, సగమునిద్రతోను అటులనేపడియుండి ఎవరు లేవకమునుపే తానులేచి బట్టలు దులుపుకొని వెళ్ళిపోయెను. తరువాత మామగారున్న మూన్నాళ్ళును యింటివైపు అయినను జూడలేదని వేరే చెప్పవలసిన పనిలేదు. తండ్రి ఇంటనున్న దినత్రయము నిమిషనిమిషమునకును చంటిపిల్లలతో దనకుమార్తెను పట్నముకు ప్రయాణము జేయించుచుండెను గాని ఆమె కించిత్తేనియు నొడంబడమిచే ఆశలు నిరాశలుకాగా విసుగుజెంది, ఆమె మీద కోపముతో 'నీకర్మము నేనేమిచెయ్యను?' అనుచు నాల్గవనాడు బయలుదేఱి ఆమెకన్నీళ్ళు తనప్రయాణము నడ్డుపెట్టుచున్నను తనయూరు వెడలిపోయెను. పిల్లలిద్దరును తాతగారితో వెళ్లుటపడలేదుగదాయని యేడ్వసాగిరి. ఎవరోఒకరు అకస్మాత్తుగావచ్చి మితిమీఱిన ప్రేమతో బ్రేమించి మూడు రోజులుండి యెత్తుకొని ముద్దాడిరనిమాత్రమే ఎఱిగియుండిరి. గాని సంబంధబాంధవ్యముల నేమాత్రమును గ్రహింపలేకైరి. అందుచే తాతగారు తిరిగివచ్చెదరేమోఅని వీధిగుమ్మమువద్ద

నిలిచియుండి దృష్టికి గోచరముకానంతవఱకు తదేకదృష్టితో నిగిడిచూచుచు, మధ్యమధ్య కూనిరాగములు తీయుచు, ఇంక వచ్చునేమో ఇంక వచ్చునేమో అను భ్రమతో లోనికి వెళ్ళి తిరిగి వచ్చి చూచుచు, ఆశ నిరాశకాగా, తల్లిని కౌగలించుకొని పెద్ద పెట్టున ఏడ్చిరి. హా! పిల్లల ప్రేమయే ప్రేమగదా! అకృత్రిమప్రేమ యెట్టి పరమ పదార్థము!

---

# సుగుణమణి

## ఐదవ పరిచ్ఛేదము.

---

ఇంటియజమానులు ఇల్లు ఖాళీజేయుమని నోటీసు ఇచ్చినట్లు మనము మున్ను చదివియుంటిమి. ఇప్పటికా కాలము సన్నిహితమగుచుండుటచే సుగుణమణి యిండ్లకొఱకు వెత్తెత్తి నట్లు వెదకించుచుండెను. తన ప్రస్తుతసంసార శిథిలతను బాగుగ గుర్తెఱిగినదగుటచే పదుగురు పెద్దమనుష్యులుండు వీథులలో నివసించుటకిష్టములేక పాతరామన్నపేటలో కాపు కమ్మ లుండు వీథిని ఒకపూరిగుడిసెను నెలకు అర్ధరూపాయ చొప్పున అద్దెకు తీసుకొని వెళ్ళి గృహప్రవేశమయ్యెను.

ఆహా! లక్ష్మి యెంతవడికలది! తన నాశించుకొనిన వాండ్రను దనయిష్టమువచ్చినట్లు ద్రిప్పునుగదా! నిమిషములో ధనము, నిమిషములో దారిద్ర్యము! ఇప్పుడు సుగుణమణి వదిలినయిం టనే మొదట ఆమె సంసారమారంభమయ్యెను. అచ్చటనే తనకు ముగ్గురుబిడ్డలును జన్మించిరి. అక్కడనే తనఐశ్వర్యము నంతయు ననుభవించెను తిరిగి ఆస్థానమే ఆమె దుఃఖములకు ఆటపట్టయి యిట్టిశోకాగ్నిలో ముంచునని యెవరనుకొనిరి? అనేకదినములనుండి కాపురముండి కష్టసుఖముల కలవాటయిన స్థానమగుటచే నచ్చోటును వదలివెళ్ళుటకు సుగుణమణికిష్టము లేకుండెను. కాని మనది గాననాళ్ళు అట్టి ఆశలు మృగ తృష్ణప్రాయములుగదా! ఇప్పటికి మనకథానాయకురాలు నూతనగృహమునజేరి దాదాపుగా పదిరోజులగుచుండె. అపుడే ఆవీధివారు లందఱు ఆమెతో పరిచయమును జేసి కొనుచుండిరి. అందనేకులు ఆమె నిదివర కెఱుంగనికారణము చేతను. తక్కినవారు ఆమె స్వాభావికమైన సుగుణ సంపత్తుల చేతను. ఆమెయెడల మిగుల ప్రేమగలిగి మర్యాద సూచక ముగ ప్రవర్తించుచుండిరి. ఆమెను, ఆమె దౌర్భాగ్యమును నెవరును యీ నవీనప్రదేశమున నెఱుంగరుగదా? ఆమె ధై ర్యముతో తలయెత్తి పదుగురితో మాట్లాడశక్తిగలదై బెంగ లేక 'హా! బ్రతుకు జీవుడా' అనుకొనుచు హాయిగనుండెను. వేయేల! ఇంటికి వచ్చినతరువాత నామెకు ఇంచుకసంతోషము తిరిగి జనియించి నాసంతోషమే సగముబలముగదా!

రాజారావుగారు పట్నము వెళ్ళినతరువాత ఒక్క ఉత్తరమైనను వ్రాయకుండుటచే ఆయనకోపమింకను శమించలేదని గ్రహించుచు, తానయిన నొక్కయుత్తరము వ్రాయవలయునని సుగుణమణి అనుకొనుచుండెను; ఇటులే రోజులు గడచుచుండ ఒకరోజున కాగితములు కలమును సిద్ధముజేసికొని వ్రాయనుద్దేశముతో కూర్చుండెనుగాని యేమివ్రాయవలయునో ఆమెకేతోచకుండుటచే అంతటితోనే అంతమొందెను. మఱియొక రోజు వ్రాయవలసినసంగతులను నిర్ధారణజేసి తిరిగి వ్రాయ యత్నించెగాని ఆనాడు సహజముగా హృదయ జనకముగా స్ఫురించుమాటలు ఉబుకకుండుటచే యేదోయొక యుత్తరమునా వ్రాయుట కిష్టములేక కొంతవరకు వ్రాసి, చింపివైచెను. తరువాత తిరిగి యింక వ్రాయయత్నింపనేలేదు. ఇటులుండ ఒకనాడు తండ్రియొద్దనుండి ఉత్తరమురాగా భయవిస్మయములతో విప్పి యిట్లని చదువదొడంగెను:—

---

అమ్మా, సుగుణమణీ, చెన్న పట్నము.

నేనక్కడికి వచ్చినప్పుడు నిన్నిక్కడికి తీసికొని రావల యునని ఎన్నో ప్రయత్నములు చేసితిని. కాని నీ వంగీకరింపవైతివి. దానికుండు కారణములు నీకే తెలియవలయును గాని నావంటిమూర్ఖుల కేమి తెలియును? నీ వేమిటి యిప్పుడు దరపశువు; రాత్రింబవళ్ళు తప్పతాగి అన్నిత్త్వైకి గంతులు వేయుచుండును; కార్యాకార్య వివేచనా శూన్యుడు; కర్తవ్యాకర్తవ్య హితాహిత జ్ఞాన మేమాత్రమును లేదు. నన్ను వదలి అట్టి కృతఘ్నునివద్ద నుండుటయే నీ కిష్టమయ్యెనేని, నీ యిచ్చవచ్చినట్లే కానిమ్ము. కాని నాకు నీ వొక్కతెవే కుమార్తెవు; నాకు వేఱుసంతానము లేదుగదా! చిన్ననాటనుండియు నిన్ను ముద్దుగా పెంచుచుంటిని. అందుచే నేను యావజ్జీవనము కష్టపడి సంపాదించిన నాలుగుడబ్బులను నీచేతిలో పెట్టి మరి చావవలయునని యున్నది; కాని, నీవు నా మాట విననైతివి. నా తలంపు నీకు గిట్టదాయె. అయినను నేను వచ్చినతరువాత నీమతి మారితివయెడల ఆసంగతి దాచక వ్రాయుము. ఎవరి నయిన మనిషిని పంపెదను. ఆమనిషి వెంట నీవును పిల్లలును వచ్చి యిచట సుఖముగా నుండవచ్చు. లేదా, ఇదియే నా ఆఖరు ఉత్తరమనుకో. నీకును నాకును ఋణము దీరినదను కొనుము. ఇక నిందుపైన నాయాస్తికి నేమాత్రమును ఆసింపకుము. జ్ఞాపకముంచుకొనుము. ఇట్లు,

దీనికిట్లు సుగుణమణి జవాబువ్రాసెను. నీతండ్రి రాజారావు

బందరు,

శ్రీనాయనగారి దివ్యసముఖమునకు—

ప్రియపుత్రిక సుగుణమణి అనేక నమస్కారములు. క్షేమము. మీయుత్తర మందినది. నాయనా! మీ స్వహస్తములతోనే గదా నన్ను నాపెనిమిటికిచ్చి వివాహము జేసితిరి! మీరే గదా మమ్ములను ఇద్దరిని చిన్ననాటనుండియు ఒక చోట నుంచి పెంచి విద్యాబుద్ధులు గఱపితిరి! మీరేగదా నన్ను సంసారము జేయుటకు ఇచటికి భర్తవద్దకు పంపితిరి. అట్టిభర్త నేడు కాలవశమున పశువైననేమి మూర్ఖుడైననేమి? అంతమాత్రమున భార్యాభర్తల అనుబంధము తెగునా? అంత మాత్రముననే ఆబాల్యముచేసిన చెలిమి మఱువనగునా? తండ్రీ! ఇంతమాత్రముననే విధాతకూర్చిన దాంపత్య బంధమును భిన్నముగావింప నలవిగాదు! ఏమైననుసరే యీయన నాపతియే, ఎప్పటికిని ఆయన నాభర్తయే. ఒకవేళ నేను ఇంచుక యిహసుఖభోగముచే వేఱుండ దలచినను నాభర్తను విడనాడి ఉన్నన్నాళ్ళు నాకు నిజమైన సుఖములేదు. కాన నాజీవితమిట్లే గడువనిండు. ఈశ్వరుని దయయుండిన నాపెనిమిటి ఎప్పటికైనా బాగుపడకుండునా? నాపూర్వకృతదోషమువలన నాకిట్టిదుర్దశ లభించినది. నేను పూర్వమెప్పుడో గొప్పపాపము చేసియుంటిని. ఇప్పుడు నేను అనుభవింపకతీరునా? కాని విధాత చేసినది చాలును. మీరునునన్ను నల్లమందుసలె నలుప ప్రయత్నింపవద్దు. ఎఱిగియో యెఱుగకయో నేను మీ

విషయమై యెట్టిఅపరాధము నయిన చేసియుంటినేని క్షమింపుడు! కాని నా అపరాధమునకు గాను, నా పిల్లల-యిద్దరి నోట గూడ మన్నుకొట్టవద్దు. దయనుంచుము.

ఇట్లు,

మీ నిర్భాగ్య ప్రియపుత్రిక,

సుగుణామణి.

రాజారావుగారు ఉత్తరమును చూచుకొని ఆలోచించి ఆలోచించి కొన్నాళ్ళకొక 'విల్' వ్రాసి రిజస్టరీ చేయించి ఉంచెను. ఇట్లుండ, కొన్నాళ్ళకొకనాడు కేశవుడు కచేరికి వెళ్ళుట చూచి సుగుణమణి కడువిస్మితయై, పాపము పగలంతయు, కష్టపడివచ్చును గదా అని ఫలాహారము తయారుగానుంచెను. పొద్దుక్రుంకుచుండెను. కేశవుడు ఇంకను రాలేదు; ఆకాశమంతయు మేఘావృతమై ఉరుములు మెరుపులతో కంపమొందుచుండెను, గాలిదేవుడు భూమ్యాకాశములు దుమారముతో ఏకమగునట్లు వీచుచుండెను, చినుకులు మెల్లమెల్లగా ఆరంభించుటచేతను అచటికి కోర్టు చాలదూరముండు ఉండుటచేతను సుగుణమణి భర్త యింకను రాలేదేమాయని దారివంక ఉండుండి తొంగితొంగి చూచుచుండగనే ఆయన వడివడినడకచే నిట్టూర్పులు విడుచుచు పరుగిడి ప్రవేశించెను. అపుడామె అత్యంతానందితురాలై పరుగుపరుగున ఆయన

తడిసిన వస్త్రములను తానే తీసి, పొడివస్త్రములు కట్టికొననిచ్చి పాదప్రక్షాళనమునకు నీరు తెచ్చియుండెను. ఆయనయు, కాళ్ళు చేతులు ముఖము శుభ్రముగ కడుగుకొని విశ్రాంతి తీర్చుకొనునంతలోనే, ఫలహారము నందియ్య, ఆత్రతతో దానిని ఆరగించుచుండెను, ఇదే సందుగ ఆమె, "ఈరోజు కచేరీలో ఏదయినా ఒక కేసుండగా వాదించ బోతిరి కాబోలు" అని అన, మన పాషాణహృదయుడగు కేశవుడు ఇంచుకేని గౌరవమేమియు లేక కర్కశస్వరముతో "లేదు, వెనుకటి స్నేహముచేత కొంతమంది ప్లీడరు గుమాస్తాలతో చీట్లాట ఆడుటకు వెళ్ళితిని." అని జవాబు ఇచ్చెను. ఇందులకు మన సుగుణామణి అత్యంత లజ్జాన్వితయయి, అడుగుట తనదే బుద్ధి తక్కువ అనుకొని తలవంచుకొని యుండ, కేశవుడు ఆకొంచె ముకూడతిని, తిరిగి దిమ్మతిరుగుటకు వెళ్ళు నుద్దేశముతో, గొడుగుకొఱకు యీమూలల ఆమూలల చూచుచుండెను. ఆమె ఆసంగతినికనిపెట్టి, "మేఘములు గర్జించుచున్నవి. ఈలాగున ఎడతెరపిలేని ధారగట్టి వర్షము కురియుచుండగా ఈరోజు నయిన ఇంటిలో ఉండగూడదా?" అని నమ్రతతో పలికెను.

కేశవుడు— ఉండుటకు వీలులేదు. నాకు అవసరమైన పని ఉన్నది ఒకరు విందుకు పిలిచినారు.

సుగుణమణి—'విందు రాత్రికిగదా, ఇప్పుడేయేమిటి, ఇంకా ఆఱున్నర అయినా కాలేదు! వాన తగ్గనియ్యాండి, అంతకుతగ్గకుంటే వెళ్ళుదురుగాని.'

కేశ—అందాకా జపముచేస్తూ కూర్చోవా? ఏమిటి?

సుగు—ఈవరుసను ఫెళ్ళుమని ఉఱుముతూంది. అసలే ఉఱుమంటే నాకు ఎంతభయమో మీకు తెలియనే తెలుసు గదా. అందులో యీ ముగ్గురి పిల్లలను నన్నును వదలి మీరు ఎలా వెళ్లుతారు? పనిచేసేదికూడా యింటిలోలేదు.

కేశ—నీనెత్తిమీద పిడుగుపడితే నేనుదగ్గరుంటే పోతుందా యేమిటి? లేకపోతే ఇద్దరం ఒకమాటు చస్తే నీకు చాలా సంతోషమా?

సుగు—పిడుగోఏదోపడి ఆచావే రావలెనుగాని, ఎన్నాళ్లకూ ఆపాడుచావు రాకుండా ఉంది.

కేశ—ఓశ్! చావంటె యెన్నాళ్ళు? చావు నీచేతిలోనే ఉంది! పిడుగు పడకపోతే గొంతుకకు ఉరి పెట్టుకోరాదు?

సుగు—నేను చావడానికేమి? నేనుపోతే యీ పిల్లలేమౌతారనే చూస్తున్నాను. మీరు కొంచెం కనిపెట్టి ఉంటారా?

కేశ— ముందర నీవుచస్తే తరువాత పిల్లలమాట చూదాంలే. అని యీమాట చెప్పుచు ఆతడు వెళ్ళిపోయెను.

అప్పుడే చీకటిపడుచుండెను; వాయుదేవుడు పెద్ద పెద్ద వృక్షముల కొమ్మలనుసహా ఫెళ్ళుమని విఱుచుచు, ఆకులను ఎగురకొట్టి నలుదిక్కుల చిమ్ముచు, ఫలముల రాలగొట్టి చిందులదొక్కి అల్లకల్లోల మొనర్చుచుండ, మఱియొక వైపున నీలమేఘావృతమైన అనంతమైన ఆకాశమున మెఱుములు ఒండొంటితో జంటగ తీగలవలె అల్లుకొనియుండ, భీకరమగు మేఘములు పర్వతములవలె భయంకరమగు నాదము చేయుచుండ, రోకళ్ళధారగ వర్షము వర్షించుచుండ, ఇట్టిభయంకరావస్థలో దయాశూన్యుడై నిష్ఠురహృదయుడై కేశవుడు మాఱు మాటాడక దిక్కులేని ఈస్త్రీని పిల్లల సహితముగ ఒంటరిగ ఇంట విడనాడి తనసొమ్మంతయు పోయినట్లుగ నిల్లువిడిచి ఎక్కడికోపోయెను.

అపుడు సుగుణమణి ఉస్సురనుచు పరుపువిప్పి పక్కవేసి పిల్లలముగ్గురిని నిద్రబుచ్చి, తానిటునటు సర్దుకొనుచుండగా ఎవరో తలుపుతట్టిరి. “ఎవరండోయ్ యింట్లోనోయ్? వుత్తరం వుత్తరం” అని పెద్దగా అఱపు వినబడెను. ఇంట్లో ఒక్కతే, బయట గాఢాంధకారము. వచ్చినవాడు దొంగవాడు కాడుగదా! అయినను కానిమ్మని ప్రాణము బిగబట్టుకొని తలుపుతియ్యగా పోస్టుబంట్రౌతు వర్షముచే కొంచెము వేళ దప్పినదని చెప్పుచు, ఒక కవరునిచ్చి వెళ్ళెను. ఆమె తిరిగి ఆతొందరలో తలుపుగొళ్ళెము పెట్టుటమఱచి మిణుకుమిణుకుమని మూలవెల్గు దీపమును కొంచెము హెచ్చుచేసి తనపేరనే

ఉండుట చూచి కవరుచింపి చదువుకొన నారంభించెను. సగము చదువునప్పటికి కాళ్ళుచేతులు వడక, దేహమంతయు చెమటపట్ట "అయ్యో! నాన్నా" అనుచు బోనులోచిక్కిన పులివలె భోరున అఱచి, స్మరణదప్పి, మూర్ఛితురాలై నేల పడెను.

అప్పటికి మిగుల ప్రొద్దుపోయెను. వానతగ్గినను ఆకస మంతయు కారుమేఘములతో నిండియుండెను. కేశవుడును ఎట్టకేలకు ఇల్లుచేరేను. నూనె శూన్యమగుటచే దీపము ఇం. చుక గప్‌గప్‌మని ఆడిఆడి అంతకుముందే ఆరిపోయెను. సుగుణమణియొక్క మృతకల్పిత ప్రాణజ్యోతికూడ గప్‌గప్ మనుచుండెను. ఇంటదీపము లేకపోవుటచే మనతాగుబోతు ప్లీడరుగారికి కోపమువచ్చి 'సుగుణా' అని పెద్దపెట్టున పిలిచి నను జవాబుగానక, ఇల్లంతయు చిందులు తొక్కుచుండగా యింటిమధ్య ఏదియో కాలికితగిలెను. స్పర్శించిచూడ మానవ శరీరమువలెనుండెను. భయ చకితుడై ఏదియో రెండుమూడు నిప్పుపుడకల నాధారము చేసుకొని బుడ్డిలో ఇంచుక చమురు పోసి దీపము వెలిగించి చూడగా సుగుణయు, ప్రక్కను ఉత్త రమును పడియుండెను. చదువుకొని మామగారు అకస్మాత్తు గా మృతినొందెనని గ్రహించెను.

తన భార్యయొక్క యీదురవస్థను జూచి, కేశవుని మనసు ఇంచుక కరగి, తనదుష్కార్యములన్నియు జ్ఞాపకము

రాగ, కొంచము పరితపించి కన్నీళ్ళుగార్చెను. తరువాత వెంటనే చెంబెడు చన్నీళ్ళుదెచ్చి ఆమె మొగముపై గొట్ట, ఆమె కొంచము స్మృతిగల్గి యీప్రక్కనుండి ఆప్రక్కకు దొర్లి కళ్ళువిప్పి తనప్రాణనాథుడు ప్రక్కనే గూర్చుండి సేవజేయుచుండ జూచెనుగాని తిరిగి నేత్రములు మూతబడ, 'అయ్యో! నాన్నా! అమ్మో! తండ్రి!" అనుచు రోదనస్వరముతో వెక్కివెక్కి యేడ్వ దొడంగెను. అంత కేశవుడు మిక్కిలి జాలిజెంది, ఆమె శిరస్సు తనఒడిలో నుంచుకొని తనకన్నీళ్ళు ఆమె ఫాలమ్ముపై కారగా. తన ఉత్తరీయముతో, తుడుచుచు, ముంగురుల నిటునటు సర్దుచు, "సుగుణా నేనుఎంతకఠినుడను; ఎంతదుర్మార్గుడను; నీకెన్ని కష్టములదెచ్చి పెట్టినాడను; నీపతినామమున కనర్హుడను; భ్రష్టుడను. నీదాసుడనగుటకైన తగను. నీరుణములెట్లు దీర్చుకొందునోగదా? నాయెడల దయజూపి నాదుష్కార్యములకు క్షమింపుము." అనుచు ఏకధారగ అశ్రుధారలు గార్పసాగెను. ఆమెయు ఈఅనుతాపమును జూచి మఱింత దుఃఖించి తన కోమలహస్తద్వయముతో బెనిమిటి గళప్రదేశమును జుట్టవేసిశోకింప ఆకన్నీరీకన్నీటితో, గలసి ఏకనదీప్రవాహముగా బ్రవహింప సాగెను. కేశవుడు ఆరాత్రినంతయు తనప్రియసఖి సేవలోనే గడపెను.

ఇట్లు తెల్లవారిన తరువాత, తనతండ్రికి వేఱు పురుష సంతానముగాని దాయాదులు గాని లేనికారణముచే, సుగుణయే శ్రాద్ధముబెట్టుటయు భోజనాదులయు పెద్దలు లేచు

నంతలోనే నాలుగుగంటలకు కేశవుని సుగుణమణి పేర, వ్యవహార కార్యములు చక్క పెట్టుకొనగలందులకు గాను సుగుణమణిని వెంటనే తీసికొని రావలయునని, పట్నమునుండి మఱి యొక ఉత్తరమువచ్చెను. ఆకారణముచేత ఆయన ఎచ్చటనో కావలసినపైక మప్పుదీసి కొని మఱునాడే సకుటుంబముగ ప్రయాణమై చెన్నపట్నము వెళ్ళెను.

---

# సుగుణమణి

---

## ఆఱవ పరిచ్ఛేదము.

బెజవాడ బందరు, తెనాలి, గుంటూరు, కాకినాడవంటి సామాన్య పట్టణములలోకంటె, పురరాజమన దగు చెన్న పురివంటి నగరమున ప్రలోభనమార్గము లెక్కువ ఉండును. ఇచట మంచి మంచి వస్తువులుకూడ సులభమైన ధరలకు దొరకుటచే సామాన్య జనులకు కూడ అందు పాటులో ఉండును. అదియునుగాక ఏవీధినవెళ్ళినను తళుకుతళుకుమను దీపముల వెలుతురులో షాపులన్నియు వరుస నేర్చినట్లుగనుండి

ఇంచుక దుర్బలులగు హరిమనస్సుల నాకర్షించుచుండును. మన కేశవుడిచటికి వచ్చినతరువాత రెండుమూడు నెలలు తిన్నగాఉన్నను, తిరిగి సారాత్రాగుట ప్రారంభించి, అంతటితో తృప్తినొందక వేశ్యాసేవ గావింపనారంభించెను. ఆవీధివారందఱు కేశవుడుమామగారు కూర్చిపెట్టిన ధనమునంతయు ఆఖరు గావించెననియు పైగా ఒకరిద్దఱు వడ్డీవర్తకులుకూడ అప్పు తీర్చలేదని ఆయనమీద వ్యాజ్యమువేసి డిక్రీపొందిరనియు చెప్పుకొనుచుండిరి.

ఆయన తిన్నగా ఉండిన యీమొదటి రెండుమాసము లలో భార్యమీదికి తిరిగి యించుక గాలిమరలుటచే అయి దాఱువందల రూప్యములనగలు చేయించెను గాని ఆమెధరింప నిష్టపడలేదు. ఆమె కిప్పుడు సుమారు 24 సంవత్సరముల వయస్సు. ఇంత పిన్నవయస్సునందే ఇట్లు సుఖదుఃఖముల అంత్య అవస్థను చూచినవారు మఱియొకరుందురాయని ఇరుగు పొరుగు వారి కప్పుడప్పుడు సందియము కల్గుచుండును. సంసార మన ఎండమావులవంటిదనియు, పుట్టుటగిట్టుటకొఱకేయనియు, బిడ్డలు కూడరారనియు, సృష్టిఅంతయు మాయఅనియు జీవింప ప్రయత్నించుట అజ్ఞాన జనకమనియు మొదలగు విషయము లను, అజ్ఞానులగు తొంబదియేండ్ల ముసలులును, పొట్ట బూడ చిన నక్షరములేని విరాగులును, రామచిలుకల వలెస్మరించు చుండు ఇట్టి మెట్టవేదాంత వాక్యముల నెల్లపఠనచేయుచు, సుగుణమణి జీవితముపైన అసహ్యభావము కల్పించుకొని ఎప్పు

టికప్పుడు చావబ్రయత్నించు చుండెనుగాని, ముఖ్యముగా ముగ్గురి పిల్లల కొఱకే ఇంకను ప్రాణముు నిలుపుకొని యుండెను. ఇట్టి అవస్థలో నగలెట్లు పెట్టుకొననిష్టపడును?

కొలది దినములలోనే కేశవుడు భార్యచెంతజేరి తిరిగి డబ్బు అయిపోయినదని మూలుగుచు, వెయ్యిరూపాయల రొక్కముగాని, నోట్లుగాని యియ్యనిచో ఇకప్రాణము నిలవదని అనేకవిధముల అడిగినను, సుగుణమణి తిరస్కరించుటచే, ఆమె నగలపెట్టె ఆరాత్రియే మాయమై వేశ్యకాంత యింటికి చేరెను. మఱునాడు డిక్రీదారులు వారంటుమీద కేశవుని ఖయిదు వేయించిరని విని కడుదుఃఖితయై ఆయనను విడిపింప సుగుణ మణి సొమ్ముపంపెను. ఆయన ఖయిదునుండి విముక్తినొందిన వెంటనే ఒకసారియైనను భార్యముఖము జూడక, వేశ్యకాంత యింట ప్రవేశించెను.

ఈమె పేరు "కరాళి." తన విటునివద్దనింక నేమాత్ర మును డబ్బులేదని తెలిసికొనినను ఆయన భార్యవద్ద ఉన్న దంతయు వదలుపకు కేశవుని ఆశించి ఉండతలచెను. ఎట్ల యినను ఇంటినుండి డబ్బుతెచ్చునను ధైర్యముతోనే అప్పు చేసి మూడువేళల తాగబోయించెను, నిజమైన ప్రేమ ఉన్నట్లు నటించుచుండెను, కేశవుడు ఈ మోసమును తెలిసి కొనలేక మిక్కిలి ఉబ్బి యీకృత్రిమ ప్రేమ ముందఱ తన ప్రాణేశ్వరి పవిత్రప్రేమను, మఱచిపోయెను.

ఈతడు బందిఖానానుండి వెడలి కరాళి యిల్లు చేరిన వెంటనే బహు పతివ్రతాశిరోమణి వలె ఆమె మిక్కిలి ఆదరించి ఆయనకు జరిగిన అవమానమునకు చింతించెను, కన్నీళ్ళు తుడుచుకొనెను, కడుపార మద్యము నిచ్చి ఎన్నియో కుశలవార్తలనడిగెను, చివరకు సుగుణామణిని దూషింపనారంభించెను. "ఆహా! మీభార్యగారు ఎంతో మంచిదని వింటిని; ఈవేళ తెలిసినదిలెండి; ఆమె మంచితనమంత;" కేశవుడు ధీరునివలె, "ఇక నేనెప్పుడును దానిముఖమును చూడను అనెను."

సుగుణ దగ్గర డబ్బు ఉంచుకొని పెనిమిటి ఖయిదుకు వెళ్ళువరకు చూచుచుండు నంతటి కృతఘ్నురాలు; యింక ఏపని చేయలేదు.? నేను వేశ్యనైతిని! లోకులు వేశ్యాంతల ప్రేమ బూటకాంశముగ చెప్పుకొందురుగాని, నిన్నను నీవు ఖయిదు బడ్డసంగతి వినినతోడనే నేనెంత యేడ్చినది భగవంతునకే తెలుసు, ఇక కేశవుని వదలి జీవించగలనా అని అనుకొంటిని. నీవీవేళ రాకున్నచో ఏమిచేసెడిదానినో నీకేమి తెలుసును? వృధాగా జెప్పిన డంబమందువు, నీవు తెచ్చిన నగలన్నియు తాకట్టుపెట్టి డబ్బుపంపెడుదానను."

ఈ మాటలన్నియువిని కేశవుడు కాల్చిన పంది ఉబ్బినట్లుగా ఉబ్బిపోయెను. ఆయన నేత్రముల కింక లోపల బయట అంతటను, "కరాళి" తప్ప ఇంకొకటి కనబడలేదు

కొందరకు "జగన్మాతా స్వామిమయము" మరికొందరకు "ప్రేమమయమై" ఉండ, ఇప్పుడు కేశవునకు "జగన్మాతా కరాళి మయమై" ఉండెను.

ఈదినము ఈవిధముగ గడచెను, మరునాడు సరస సల్లాపములలో సుగుణమణి వద్దనుండు డబ్బును, నోట్లను సమస్తమును వదలించి, విషముపెట్టి చంపవలయునని విటీవిటు లిద్దఱును నిశ్చయించుకొనిరి.

---

# సు గు ణ మ ణి

## ఏ డ వ ప రి చ్ఛే ద ము .

---

కేశవుడు చెన్నపట్నము వెళ్ళి తనమామగారి యావత్తు సొత్తునకు జవాబుదారు అయినతరువాత సులభముగా వ్యవహారములు చక్కబెట్టుటకు వీలుగా నుండుటకై సుగుణమణి వద్దనుండి ఒక 'అనుమతి పత్రిము' వ్రాయించి పుచ్చుకొనెను. దారిద్ర్యము సంభవించినప్పుడు సజ్జనుడు దుర్జనుడగుటయు, అదివఱకెంత ఉన్నతస్థానము వహించినను, అప్పటికి

లోభియై సకల నీచకార్యములకును ఒడిగట్టుటయు, కార్యా
రంభము వివేచనశక్తిగూడ నశించుటయు, మనము సాధారణ
ముగా నెఱింగియే యున్నారము. అట్టిస్థితిలో ఇక మన కేశవుని
విషయములో వేరుగా చెప్పవలెనా? ఆయనకిప్పుడు అంతయు
లేమియే. ఖర్చునకు ఒక దమ్మిడీ అయినా లేదు. మాటిమాటికి
తన భార్యను యాచించుట కిష్టమును లేదు. కరాళి, దేవి,
సుగుణమణి వద్దను ఊడి దోపిడి చేయించి సొమ్మును తెప్పించ
గలనను ధైర్యములో చాలకాలము త్రాగుడు ఖర్చు గడుపు
చుండెను. కాని మార్గము కనుపించే అవకాశము లేకుండుటచే
ఆఖర్చును తగ్గించెను. అదిగాక వేశ్యాస్త్రీ సహజరీతిని
దినదినము కేశవునిపై ఇదివరకు చూపునట్టి ప్రేమ ప్రభావము
సన్నగిల్ల నారంభించుటయే గాక, కొంచెము తీవ్రతతో
ప్రవర్తించుటయు, అతనిని చూచినపుడెల్ల కనుబొమలు
చిట్లించి, గ్రుడ్లఎర్రజేసి ధుమధుమలాడుటయు ప్రారంభించెను.
అందుచే కేశవుడేమియు చేయజాలక తన ప్రియవేశ్య నెట్లు
మెప్పింతునా యను దీక్షతో తరు మాచరించుచు, దుర్మార్గు
లకు సహజమైన దుష్ట చింతలు చేసి చేసి, తుదకు తనమామ
గారి యిల్లు అమ్మివేసి, ఆడబ్బును తాను అపహరింప వలెనని
ఎత్తు వేసెను. అమ్మకట కొంచెము బైటకు పొక్కినతోడనే
రెండుమూడు వందలమంది ఖరీదుదారులు ఆయనచుట్టును
చేరిరి. కాని ఇబ్బందులవలనను, అవసరముచేతను అమ్మవలసి
వచ్చినప్పుడు అసలు సొమ్మెప్పుడును రాదు. అదిగాక

ఇందులో ఆస్తికి యజమానురాలగు సుగుణమణి, భావి ఉత్త రాధికారులు రాజారావుగారి మనుమలును జీవించి యుండిరి. హిందూ ధర్మశాస్త్ర ప్రకారము ఇట్టి స్థిరాస్తిని విక్రయించు టకు అల్లుని కేమాత్రము అధికారము లేదు. ఈ కారణముల చేత ఇది తన అనధికార విక్రయమగుటయే గాక రహస్యవిక్రయము కూడ అగుటచే, క్రయదారులు సగముడబ్బు పెట్టుబడి పెట్టు టకు కూడ జంకుచుండిరి. ఆయింటి ఖరీదు పదివేల రూపా యలకు తక్కువ కానిదైనను, ఇప్పుడు రెండు మూడు వేల రూప్యములకన్న నెక్కువ వెల అడుగుటలేదు. అయినను మన కేశవున కంతే చాలు గాన, అంతుల కిష్టపడి రెండుమూడు వందలు బయానా పుచ్చుకొని, సుగుణమణికి తెలియకుండగ ఖరారునామా వ్రాసి యిచ్చెను. తరువాత వ్రాసియియ్యవలసి యున్న క్రయదస్తావేజు గూడ తయారు చేసి, అందులో సుగుణ మణి సంతకము తప్పనిసరి యగుటచే దానికొరకై ఇప్పుడా పత్రము చేతపట్టుకొని ఆమెవద్దకు వెళ్లెను.

ఇట్లు ఆ రాత్రిగా వెళ్ళి ఆమె ప్రక్క చేరునట్లుగ గూ ర్చుండి కులుక నారంభించెను. కాని సుగుణమణి హృదయము గూడ ఇప్పుడు పాషాణప్రాయమయ్యెను. పెనిమిటిపై పూర్వ మున్న ప్రేమ చాలవరకు తగ్గిపోయినది. ఇందాశ్చర్యమేము న్నది? ఇట్లు గాక ఇంకెట్లుండును? భర్త తనకొరకు ఏమాత్రము చింతిల్లకుండుటయే గాక, వేశ్యాలోలుడు గూడనై, మద

మత్తుడై అస్త్రిన నేయు సరింపజేసి పిల్లలవంక అనుమానాస్త్రైన చూడఁగుండినప్పుడు ఆమె సహజ ప్రేమ కుంకించినదనుట యందాశ్చర్యమేమున్నది? హంస కాకిని ముద్దాడునుగదా? కుక్కయు పిల్లియు చెలగాటమాడునుగదా? భర్త నీచుడు మోసగాడు, లజ్జాహీనుడును, నిందనీయుడు, తుచ్ఛుడు, పనికిమాలిన పలుగాకి, విషయాసక్తుడు, నిర్దయ హృదయుడు భార్య సద్గుణపుంజములకు బుట్టినిల్లు. విద్యావతియగు యువతి, పిల్లలతల్లి, కులీనురాలు, ఏకాంత ప్రేమానురక్త. బీదసాదలకు అన్న వస్త్రదాత అహాహా! ఇంత భేదమున్న, స్నేహము కుదురునెట్లు? పద్మబాంధవుడస్తగిరి నుదయించిన, నిప్పునుండి నీరుగారిన, నక్షత్రమండలము చిందరవందరమై చలించిన అపవాదు కుదురవచ్చును. సుజన దుర్జనుల స్నేహము బోసి నోటినుండి వెడలు గానమువంటిది; కళావిహీనమైన అంగారమును మహోజ్జ్వలమైన కుంకుమరాగమును కలసి నట్లుండును. ఈశ్వరసృష్టిలో ఇది అంతయు అసాధ్యముగదా! ఈభేదము నెఱింగియే దారిద్దుడు ఇప్పుడు భక్ష్యసందర్శనముచే నోట నీరూరునట్లు ప్రేమపూర్వకముగు మాటల నేవియు చెప్పకొనక ఎండుకట్టెలవలె రసహీనమైన నిర్దయనిష్ఠుర సంభాషణముగావించుకొనుచుండిరి. ఇట్లుండగ సమయముగడిపి కేశవుడల్లానో కొంచెము ధైర్యము దెచ్చుకొని మాటల సందర్భమున నిట్లని నుడువజొచ్చెను:—

కేశవుడు—"మన మీయిల్లు అమ్మివేసిన యెడల కొంతపీడ వదలును." సుగుణామణి భయాశ్చర్యముల తో—"ఇదికూడ లేకుండ చేసి నాకు తలదాచుకొనుటకైన చోటులేకుండ జేయ వలయుననియా?"

కేశ—"దీనినమ్మివేసి యింకొకటి కొనిన బాగుండును."

సుగు—"ఆకర్మమేమి?"

కేశ—"మనము ఇంతయింటికి పన్ను ఎక్కువ ఇయ్యవలసివచ్చుచున్నది. మనకువచ్చు అల్పాదాయము పన్నుకుసరి పోవుటలేదుకదా? అదిగాక ఎవరిస్థితికి వారుతగినట్లుండ వలయును గాని దీనులమైన మనమీ ప్రాసాదమున నుండుట హాస్యాస్పదముగదా? పేదమూతికి సంపెగ నూనె రాసినట్లున్నది. కాన వెంటనే దీనిని విక్రయించుట మంచిది"

సుగు—కొంచెము మొగముత్రిప్పుకొని, "ఎవరిమూలమున మనమిట్లైతిమి? మనకీగతి యెందుకు ప్రాప్తించినది?"

కేశ—"ఎవరిమూలమున ప్రాప్తించిననేమి? ఎందుచేతనైన నేమి? చిక్కులలో బడినపుడు సమయోచిత జ్ఞానము

పరకారణములు పైకరర్ల వితర్కములుచేసి, ప్రొద్దు బుచ్చుట బుద్ధిహీనులపనిగాదా?"

ఆహా! కేశవుని యీసమయోచిత మాయోపాయము అకు మనము మెచ్చుకొనవలసినదియే! అసహాయురాలైన అబలను లోబరచుకొనదలంచెను. కాని సుగుణయు సమయమునకు దీసిపోవునదిగాదు, ఆమాటలు విన్నవెంటనే అచ్చటనుండి విగటుగాలేచి వెళ్ళి గదిలో శయనించెను.

కేశవుడించుకసేపు అచ్చటనే ఏమో ఆలోచించుకొని శయనమందిరములో ప్రవేశించి యిట్లనియెను. "సుగుణా! ఏమి కులికెదవులే. నీరోగము యిదివరకే కుదిర్చినాను! ఇల్లువిక్రియ మిదివరకేయైనది. ఖరారునామా వ్రాసియిచ్చి రెండుమూడువందల బయానాకూడ పుచ్చుకొన్నాను. కేవల మీపత్రముపై నీదస్కత్తే గావలయును. నీవింక ఏమియు చేయజాలవు." అనుచు జేబులోని పత్రముదీసి చేతికిచ్చి, కలము సిరాబుడ్డికొరకు ప్రక్కగదిలోనికి వెళ్ళెను.

సుగుణమణి ఇదిఅంతయుచూచి ఆశ్చర్యాన్వితురాలయి నివ్వెరపడజొచ్చెను. చైతన్యము తగ్గెను. కన్నులు చీకటులు గ్రమ్మెను. తల గిరగిర తిరుగుచుండెను. మూర్ఛారోగమువలె కాళ్ళు చేతులు వంకరులుబోయి ఒళ్ళంతయు చెమటపట్టెను. చేతనున్న కాగితము జారి క్రిందపడెను. ఏమిచేయుటకును

తో చక్కుండెను. పాషండుడు ప్రాణముదీయునేమో! ఇంతలో కేశవుడు కలము సిరాబుడ్డి తెచ్చి సిరాలో ముంచి కలము చేతికిచ్చి వ్రాలు చేయుమని చెప్పెను. తానిదివరకే సాక్షి సంతకము నిమిత్తమై కూడ తెచ్చి యింతవరకు బైటగూర్చుండ బెట్టిన తనముగ్గురి సహచరులను పిలిచెను ఆమెయు ఏదియో ఆపద వాటిల్లనున్నదని గ్రహించి పెనిమిటి రెండుపాదములను పట్టుకొని, పిల్లలు బ్రతికియుండగ ఇట్లు చేయుట మంచిదాయని యేడ్వసాగెను. అతడును ఈ మాయయేడ్పులకేమిలే అనుచు, ఇనప మేకులవంటి వేళ్ళతో ఆమె చేయి పట్టుకొని దస్కతు చేయుమనుచు బలవంత పెట్టసాగెను. ఆమె అంగీకరింపలేదు. కేశవుడు 'ఓసీ! ముండా, నీకింత పట్టుదలయా యనుచు ఆముగ్గురి నీచులను కలుపుకొని వ్రాలు చేసెదవా లేదా అనుచు బాధింప జొచ్చెను. ఆమె ఇంక నేమాత్రము ఓర్వజాలక, రావణుని చేత చిక్కిన సీతచందమున, పులినోట పడిన మేకను పగిది, హా హాకారములతో, చెవులుచిల్లులు బడునట్లు వినువీధులదరు నట్లు, కఠోరహృదయముకూడ కరిగిపోవునట్లు, అరచుచు ఏడ్వసాగెను. ఆయబల ఆర్తనాదము విని, వీధిలో బోవు వారందరును ఇంటిచుట్టు మూగిరి. ఇరుగు పొరుగు వారు కొందరువచ్చి కేశవుని నిందించుచు, తలుపు బ్రద్దలు గొట్టి లోపల ప్రవేశింప దలచుకొనిరి. ఇదిచూచి అత్తడిక లాభము లేదనుకొని, అయినను కసియైన తీర్చుకొనదలచి, నాటు మేకులుగల చెడాపులు తొడుగుకొనిన కాళ్ళతో ఆమె

గుండెపై ఎగిరి నాలుగు తన్నులు తన్నెను. తన్నుటయు ఆమె వెంటనే వలవలలాడుచు మూర్ఛజెందెను. నోటినుండి రక్తము కారుచుండెను, ఆరక్తస్రావము చూచినవారు నలుగురును భయపడి, జీహోవా, ప్రమాదమా వచ్చునేమోయనుచు దొడ్డిత్రోవను ఈగోడమీదనుండి ఒకరును, ఆగోడమీదనుండి మరిఒకరును దుమికి బలముకొద్ది పారిపోయిరి.

ఈ నరపశువు దౌర్జన్యము ఇంతటితో ఆగెనా? క్రయపట్టికలో సుగుణమణి దస్కతు కాకపోవుటచే కార్యభంగమయ్యెను. ఇట్టిపరిస్థితులలో బహూమానా పుచ్చుకొనిన సొమ్మును తిరిగి యియ్యవలసియుండెను. కాని, అదింకను నిలవనున్నదా? సగము బ్రాందిపాపుకు, మరిసగము 'కర్బీ' దేసికి సమర్పింపబడెను అందుచే అతడాలోచించి ఆలోచించి ఆనురాన్మస్గుడే ఆపత్రముపై సుగుణ చేవ్రాలు ఫోర్జరీజేసి, ఒకరిద్దరి స్నేహితులకు తాగబోసి సాక్షిసంతకము చేయించి, తనకియ్యబడిన అనుమతిపత్రబలముచే దానిని రెజస్టరీచేయించెను.

ఈ వైపున ఇలాపుండగా, ఇంటిలో సుగుణసి అవస్థ చెప్పతరముగాకయున్నది. పెసిమిటి మొగుడు రొమ్మునతన్ని వెళ్ళిననాటినుండి ప్రతిరోజు అదేసమయమున జ్వరముతగులుటయు, రక్తముగారుటయు. ప్రారంభమాయెను, నడుము ఎత్తలేక ఎప్పుడును మంచముమీద పడియుండుటయు సంభవించెను. ఆపసికూనలవంక చూచువారైనను లేరైరి, కాని

తన తండ్రి బ్రతికియున్నప్పుడు ఆయన స్నేహితుడైన ఒక వైద్యుడు కనికరముచే ప్రతిదినమును వచ్చి నాడి పరీక్షించి తగుఔషధమునిచ్చి యించుక సహాయము చేయుచుండెను. ఆయన ఆమె ఎక్కడనో పడుటచే అట్లు రోగ గ్రస్తురాలయ్యెననుకొనెను గాని నిజము నెఱుగడు. సుగుణ ఆసంగతి ఎవరికిని చెప్పక దాచియుంచెను. పాపము, ఇంకను భర్తయన్న ఎంతప్రేమ !

ఇట్లు దినములు గడచుచుండెను. ఆమెజబ్బుకూడ దినదినప్రవర్ధమానమై క్షయరోగముక్రిందకి దిగెను. ఆహారాత్రిములు మూలుగుచు పిల్లలగతి ఏమగునాయని చింతిల్లుటయేగాని ఆమెకు మరొక చింతలేదు. కొన్నాళ్ళకు ఒకనాటి ఉదయమున ముగ్గురు పిల్లలును నిద్రనుండిలేచి మంచము చుట్టును కూర్చుండి, యేకధారగా కన్నీరుగార్చుచున్న తల్లి వంక రెప్పవాల్చక చూచుచు నివ్వెఱపడి, కొంతసేపటికి వారును హాహారుమని విడ్చిరి తల్లి గుండెయు కరిగి ఆమె రోదనమెక్కువ యయ్యెను, అట్టివారి దావానలశోకములు పరుల రాతిగుండెనైనను పగులగొట్ట శక్తిగలిగియుండెను. పెద్దపిల్లవాడు ఏడ్పుయేడ్చి, "అమ్మా యింకనేలయేడ్చెదవు? నీకు జబ్బెక్కువగు" ననుచు ముద్దుమాటలతో సూఱడించి, తన చిన్నికోమల హస్తములతో నామె కన్నీరు తుడుచుచుండెను. ఇట్టి సమయమున బయట నెవరినో దడబడమాటలు విన

బడుటచే దాసి లోపలకువచ్చి "అమ్మా బాబుగారు యిల్లమ్మివేసినారట ! హక్కుదారులు సొమ్ములో బరచుకొనుటకు వచ్చినారు, ఇల్లు ఖాళీచేయుమనుచున్నారు." అని చెప్పెను.

అయ్యో ! సుగుణ అనుకున్నంతయు అయ్యెనుగదా ! పితార్జితమైన గృహంబు దక్కకాక యనితలంచెను. ఎన్ని పోయినను పిల్లలకు ఇదియైన నిలిచియుండుననుకొనెను, ఇన్ని బాధలకు ఓర్చి, నేటి క్షయరోగమునుకూడ దెచ్చి పెట్టుకొనెను, అదియు లేకుండ గృహము అమ్ముడయ్యెనా ? అయ్యో ! అక్కటా ! ఎంతటి పాపకర్మము' ఆమాటలు వినినతోడనే ఆమెకు ఒళ్ళంత చెమటపట్టెను; నమ్మజాలక పొరుగువారి కొకరికి కబురంపి పిలిపించుకొని, ఇట్లు క్రియముగాలేదని వారిచే విక్రయదారులకు చెప్పించెను. వారు వెంటనే బట్ట చాటునుండి ఒకపత్రము తీసి చూపింప అందు సుగుణ సంతకము ఉండెను. ఆమెయు దానినిచూచి భయవికంపితయై భర్త యింతజేసి పిల్లల ఉసురు పోసికొనెననుచు ఉస్సురని ఒక్కని టూర్పు విడిచెను.

ఆవచ్చినవారును యజమానురాలు జబ్బుగా నున్నదని విని ఇంచుక కనికరించి మూడురోజులు గడువిచ్చి వెళ్ళిరి.

తరువాత, సుగుణ చేయునున్నది గానక ఇంటిప్రక్కనున్న ఒక ప్లీడరుగారికి వర్తమాన మంపి, విక్రయదారుల

మీాద వ్యాజ్యెము వేసి దస్కతు ఫోర్జరీయని ప్రమాణము
జేసిన నిల్లు దక్కు ననియుగాని రెండవ పక్షమున కేశవునికి
కారాగృహప్రవేశము లభింపగలదనియు విని మొదటిదానికి
సంతసించినను రెండవమాటకు భయమొందె, అట్టిమాటయైన
ను వినజాలక భర్తమీాద నతిగ్గతమైయున్న ప్రేమ ఉప్పొంగ
జొచ్చెను. మొదట కలిగిన ఆశ మృగతృష్ణప్రాయ మయ్యెను.
ఈ సంసారమున ఒకమాటు ప్రేమించి వివాహమాడిన తరు
వాత, ఒకొక్కపుడు కారణాంతరములవలన క్షణకాల మా
ప్రేమకు భంగము గలిగినను, ఆయాటంకముల నెల్ల తొలి
గించి మొదటి ప్రేమ నెల్లయు న మల్లెతీగలవలె వృద్ధి బొందింప
జూడవలయుననియు, ఆత్మలకు దేహము శూన్యమైనను
ప్రేమానురాగముతో జీవముగడపినపిమ్మట భార్యాభర్తల
జీవులు పరకాలమున గలసికొని ఆనందపారవశ్యమైన అపార్థి
వ ప్రేమలో తేలుచుండుననియు, ఒకమారు ఇచ్ఛాపూర్వ
కముగా వివాహమాడినతరువాత భార్యకుగాని, భర్తకుగాని
మరియొకరి నన్యవిధముగ జూచి, ఏకారణము చేతనైనను, పున
ర్వివాహమాడుట నిద్యముగను శోచనీయమును, రాక్షసకృ
త్యమును, అనియు ఆమె దృఢాభిప్రాయము, ఇదియే ఆమెభర్త
మీాదిఅనురాగమునకు, కారణమగుటచే.ఆమె.ఎందునకొప్పు
కొనినను భర్తను కారాగృహవాసిని చేయుట కొప్పుకొనక,
యిచ్చిన క్రయధనము తిరిగి పుచ్చుకొని పత్రము వదలుకొన
వలయునని పిక్రియదారులకు వర్తమాన మంపెనుగాని,
వారందు కిష్టపడమిచే ఇల్లు ఖాళీ జేయు ఆలోచించుచుండెను.

సుగుణమణి తన తండ్రిగారు గతించిన తరువాత చెన్నపట్నమునకు వచ్చి యింటియందు ప్రవేశించిన కొలది దినములకే ఆనాడు పురిటింట తన తల్లి పోయినచోటను, తరువాత మొన్న మొన్న తండ్రి గతించిన స్థలము నందును, ఆయింటనే ఆ రెండు ప్రదేశముల రెండు చిన్న మందిరములను కట్టించి అందు వారిద్దరి పటములను ఉంచి ప్రతిదినమును ప్రాతస్స్నానము సమయములలో అందు ప్రవేశించి భయభక్తులతో దోసిలినిండ పుష్పముల గైకొని, తనలో తాను ఏమేమొ స్మరించుకొనుచు చిన్ననాటి సంగతుల నన్నియు జ్ఞప్తికి తెచ్చుకొనుచు ఇంక అనేకవిధముల ఎన్ని తెఱంగులనో స్మరించుకొనుచు ఏడ్చుచుండును. మధ్య మధ్య పంచభక్ష్య పరమాన్నములతో వండించిన నైవేద్యములను ఆ యుభయమందిరములలో ఉంచి మఱియెప్పటివలె నన్నాదరించుచున్నావా నాన్నా ఆరగింపుమనుచు, అయ్యో ! మీ చిన్ని సుగుణని మఱచి పోయితిరా ? అని అనేకగతులను పలవరించుచు పలువిధముల వివిధవికారక్రియాకలాపములను చేయుచుండును. ఈరోజు గడపుదినములలో మూడవరోజగుటచే ఇక నీమంపెరముల జూడనుగదాయని పిలపించి ఉదయమునందే పిల్లల జేరదీసికొని ముందర తల్లిపటమున్నచోటికి పోయి ముగ్గురి పిల్లల చేతులు జోడింప నియమించి, తాను నయనవినయములతో సాష్టాంగపడి, అనేకవిధముల నాపటములను బలుకరించి "అయ్యో! తల్లీ ! సుగుణ దుస్థితి జూచితివా ? నా దౌర్భాగ్యవశమున

నీ ప్రేమ నేమాత్రము నెరుగనైతిని! అమ్మా! యింత కలిగియున్న యింట బుట్టినను నాగతి యెంతకు వచ్చినదే! నీయిల్లని చెప్పుకొనుటకయినను గతిలేకపోయెనే! అమ్మా! యీ పిల్లలనైన నాశీర్వదింపవే!" అనుచు నాపటముక్రింద గనున్న యింత మృత్తికను అముగ్గురి బాలుర నుదుటనురాసి చివరకు ఆబొమ్మను దీసికొని పూజనాసూచకముగా శిరమున బెట్టుకొని, అటనుండి తండ్రి మందిరము బ్రవేశించి యచటను అట్లే చేసి ఆపటమునుగూడ దీసికొని వలవలయేడ్చుచు శయనాగారములో ప్రవేశించెను.

## సుగుణమణి
### ఎనిమిదవ పరిచ్ఛేదము.

ఆ రోజున సుగుణమణి ఆ యింటినుండి, లేచివెళ్ళి, ఏమారు మూలనో ఒక చిన్నకుటీరము నద్దెకుదీసికొని ఏదో ఒక విధముగా కాలము గడుపుచుండెను. బహు కాలము నుండి ఒంటనాటిన దుఃఖము చేతను, ఏరోజుకారోజు ఇన్ని గంజినీళ్ళైన సరిగ కాచిపోయగతిలేక ఏమిచేయుదునా భగవంతుడా అను దురంతచింత చేతను, ఆమెరోగము అధికమగు చున్నది, మృత్యువునోటబడి ఆబాధనుండి తప్పించుకొనవలె నని ఎప్పటికప్పుడు అనుకొనుచుండును గాని, ఎన్నిసార్లుతలంచి నను తనముగ్గురు పిల్లలగతియేమగునో అనుచింతయే ఆమె

నట్టి ఘోరకృత్యమునకు పాల్పడనేరక ఆపుచుండెను. ఒక నాడింత జావతాగి మంచముమీద వెలికిలపరుండి, చిన్న బిడ్డను గుండెలమీద నెక్కించుకొని ముద్దాడుచు, తక్కిన పెద్దపిల్లలనిద్దరను ఇరు పార్శ్వముల, కూర్చుండనియమించి. జేష్టపుత్రునితో ఇట్లనియెను:— సుకుమారా! మీతాతగారి వద్దనుంచి రమ్మని నాకు తరుచు వార్తలు వచ్చుచున్నవి వెళ్ళనా?" అనినవెంటనే. ఆపసిబిడ్డయు ఆతురతతో "అమ్మా! తాతగారిప్పుడు యెక్కడనున్నారే?" అని అడిగెను.

అంతటఆమెయు ఆకాశము వ్రేలుచూపుచు "నాన్నా! అదుగో అక్కడ స్వర్గములో హాయిగాసుఖముగా నున్నాడని తెలియచెప్పెను.

సుకుమారుడంతట, "అమ్మా! అట్లయిన మమ్ములను కూడ నీతోతీసుకపొమ్మా" అని ఏమియెరుగని పసితనముచేత నుటయు, తల్లిఅట్టిమాటల నాడవద్దని నివారించినను వినక "అమ్మా! నీవు మమ్మువదలిపోయినచో, మేమెవరివద్ద నుండెద" మని పిల్లలు సహజభావముతో గట్టిగా నడిగెను.

ఆమాటలువిని భరింపలేక, సుగుణ కంటినుండి ఏడతె గనిధారగ నీరుగార లోలోపల ఏడ్చుచు మాటాడలేక పోయెను. సుకుమారుడు, "అమ్మా! ఏడ్వనలదు; ఎడ్చిన నీకుజబ్బు ఎక్కువగు" నని చెప్పుచు, తనరుమాలుఅంచుతో,

తల్లికన్నుల తుడుచుచు ఓదార్చెను గాని ఆమె ఓదార్చినకొల
దిని మఱింత వలవల నేడ్వ దగ్గు ఆరంభమయ్యెను. ఆదగ్గుచే
నోటనుండి రక్తముకారి మూర్ఛవచ్చిపడిపోయెను.

పిల్లలు మువ్వురుకూడ కెవ్వున కేకవేసి యేడ్వసాగిరి,
సుకుమారుడు తిరిగి, "అమ్మా! మాట్లాడవేమే?" అని పలుక
రించునంతలో, వైద్యుడు వచ్చెను; జరిగిన గతి అంతయువిని
ఆశ్చర్యమొందెను, రోగిని పరీక్షించి, కొంచెమాలో
చించి, మందుల పెట్టెదెరచి, ఒకబుడ్డి వాసన చూపించి,
మఱియొకబుడ్డిలోనిది మందుతీసి నోటికి బోయుచుండగా తిరిగి ప్రాణము
దెప్పరిల్లెను అప్పుడు సుగుణ ఇంకను మాటాడవలెనని
యత్నించెను గాని ఆయన వారించి, తరువాత నెమ్మదిమీద
అన్నియు చెప్పవచ్చునని చెప్పెను. చాలసేపు కూర్చుండి సేవ
చేసి ధైర్యము చెప్పి వెళ్లెను. పాపము ఆ వైద్యుడు అతిదయా
శీలుడు. బీదల కొరకు ఉచితముగా మందులనిచ్చుచుండును.
అదిగాక దిక్కులేని పిల్లల చేరదీసి యింటనుంచుకొని అన్న
వస్త్రములిచ్చి చదువు చెప్పించుచుండును. రాజారావుగారి
కుమార్తె అగుటచే సుగుణమ్మమీద ఈయనకు అత్యంత
ప్రేమ. ఈమెను చూచుటకు రోజునకు రెండు మూడు సారులు వచ్చును;
కేశవునినిగురించి విని మిక్కిలి చింతించెను ఈమె యిక అధిక
దినములు జీవింపదని గ్రహించుటచే పిల్లలేమగుదురా అని
ఈయన ప్రాణములు తల్లడిల్లుచు నేయుండెను, మిక్కిలి ఘన
వైద్యుడైనను మృత్యుముఖము రక్షించు నెవరితరము? ఈయన

మును మనకనులయెదుట లేరా? మనకేశవుడు, ఇట్టివాడే. అంతేకాదు. ఇంతకంటె నధముడు. తక్కినవారికి పదుగురే మందురో అను సిగ్గైనగలుగదుగాని యీాయన కదియును లేదు; వారకాంతయిల్లే తన బసగ చేసికొని పశువుకంటెనధముడుగా తిరుగుచున్నాడు. కేశవా! ఛీ! ఏమి నీబ్రతుకు! మాణిక్యము వంటి భార్యను రత్నములవంటి బిడ్డలను వదలి ఎందుకును కొఱగాక, మామగారి సొమ్మంతయు గుల్లచేసి, విద్యకు దుర్నామముదెచ్చి, మానవనామమున కనర్హుడవై యెట్టిసీచపుబ్రతుకును బ్రతుకుచున్నావోయి! నీవుబ్రతికియుండనేల? నీవుచచ్చినను భూమికిలోటా? నీవంటిబ్రతుకు ఎంతమందిబ్రతుకుటలేదు? కాని, వారికి విద్యలేదను కుయుక్తియైన గలదు. నీకదియును లేక యెట్టివ్యర్థుడవైతివి? నీవు చిన్ననాడు నేర్చిన విద్యయంతయు నేమయ్యె? ఎట్టి ఘనపరీక్షయందు కృతార్థుడవైతివి వి. ఆహాహా! సచ్చరిత్రమునకు నీతిశిక్షలేక సామాన్య విద్యచాలదని సాటించుచు నీవాదఱకు నుదాహరణమై ఉన్నట్లున్నయది! నినుచూచియైన నితరులు నేర్చుకొందురుగాక! నీయింటివెనుక కుక్కకూడ నీకంటె ఉన్నతజీవితములో గడుపుచున్నది. కేశవా! ఛీ! ఛీ! ఛీ! లెమ్ము, లెమ్ము, ఇకనైన ఒళ్ళుదెలసికొని అయ్యో నాగతి యేమగునా భగవంతుడా అని ఒక్కసారి ఏడువుకో. ఆయన అతికరుణాశీలుడు! దయార్ద్రహృదయుడు! ఎట్టిపాపులైనను ఆపురని ఒక్కమాటేడ్చిన మాత్రముననే లేవదీసి రక్షించును! నీకాయనయే గతి! వేరు

లేదు. లెమ్ము! లెమ్ము!

తిరిగి యించుక మన సుగుణమణి వంకజూతము. పాపమామె భర్త ఒనర్చిన ఘోరకృత్యములను నా డేమరచెను. రోగశయ్యాయాగనుండియు ఆయనను ఒక్కనాడును మఱవలేదు. ఆమె తనయంత్యదినములు సమీపమునఉన్నవని తెలిసికొని ప్రాణములులోపల ఒకనాటి రాత్రైన తిరిగి భర్తను చూచునుద్దేశముతో. ఎలానో లేచి కూర్చుండి ఈ విధమున ఉత్తరమొకటి వ్రాసెను:—

కేశవా, ప్రాణేశ్వరా, నా అంత్యదినము సమీపమునకు వచ్చినది. నేనేదైన అపరాధము చేసిఉంటినేని క్షమించి, ఒక్క మారువచ్చి చూడవేని, ఇంక నీజన్మమున నన్నుచూడబోవు, గ్రహింపుము.

ఇట్లు,

నీప్రాణేశ్వరి, సుగుణమణి,

ఉత్తరము సకాలమున కేశవునకు అందెను. ఇన్నాళ్ళనుండియు ఆమె స్మృతియే లేకుండుటచే ఈ రోజున హఠాత్తుగా నీయుత్తరము చూచుకొని, ఏమియో ఆలోచించి ఆరోజు సాయంకాలముననే వెళ్ళి చూడ దలచుకొనెను. ఆసంగతి "కరాళి" చెవినిబడగనే తానును కూడ వత్తునని చెప్పెను. ఆమె కష్టము జెప్పుటకు కేశవునికి సాధ్యమా !

ఇట్లిద్దరును చీకటి పడినతరువాత బండియెక్కి ఆకుటీరము చేరిరి. కేశవుడు దిగివెళ్లెను గాని, ఆవేశ్య ఏమియో విచారించి బండిలోనే కూర్చుండి భార్యను చూచివచ్చుటకు అయిదు నిమిషములు మాత్రము గడువిచ్చెను. అప్పటికి పెద్దపిల్లలిద్దరును గుమ్మమువద్దనే ఆడుకొనుచు, తండ్రినిజూచి సంతోషముచే పరవశమొందిరి; పెద్దవాడు "నాన్నా, అమ్మకు చాలజబ్బుగనున్నది. వచ్చిచూడు!" అనుచు చేయిపట్టుకొని లాగుచు తీసికొని వెళ్లెను. రెండవవాడు ముద్దుమాటలతో "నాన్నా! ఒక్క మాటెత్తుకోవు?" అని అనుచున్నను, కేశవుడుతన తెల్లనిబట్టలు మాసిపోవునను భయముతో తీవ్రదృష్టితో చూచెను. పాపము చిన్న బాలుడు చిన్నబుచ్చుకొనెను. మన కేశవునికి పిల్లలకన్న తెల్లబట్టలు ఎక్కువ ఆయెను! ఎట్టి గతి ! కాని యిట్టివారిని మనము సాధారణముగా జూచుచునే యున్నారము.

ఇట్లు ఇద్దరుపిల్లలును ఇరుపార్శ్వములనడువ కేశవుడు సుగుణమణి పరుండుగదిలో ప్రవేశించెను. ఆమె భర్తను చూడగనే కౌగిలించుకొని రెండు చేతులును మెడకు పెనవేసి, శిరమూ తనిరొమ్మున జేర్చి వెక్కి వెక్కి ఏడువ నారంభించెను. ఆయనయు కొంతనొచ్చుకొనగా ఆమె ఎన్నాళ్ళనుండియో మనసున అణిగియున్న సంగతులనన్నిటిని వెలిబుచ్చెను. హిమాలయములనుండి దిగజారి వేడివలన కరగి కరగి గంగాప్రవాహమై పారు ఘనీభ హిమకండములవలె ఆమె

హృదయమున ఇన్నాళ్ళనుండి దాగియున్న దుఃఖభావములన్ని
యు భర్తగారి ఆలింగన ఉష్ణముచే కరిగి కొంతకన్నీటి ప్రవాహ
ముగను మరికొంత గొణుగుడు శబ్దవాక్యములుగాను పైకి
పొంగి వెల్లువలై ప్రవహింప జొచ్చెను. పసుప్రాయుడైన కేశ
వుని గుండెలు చలించలేదు గాని ఇంకొకడైన వెర్రెత్తియేడ్చు
నంతటి దీనముగానుండెను. కష్టసుఖముల సుఖదుఃఖములనన్ని
టిని వెక్కి వెక్కి ఏడ్చుచు చెప్పి చెప్పి తుదకు సుగణమణి
కేశవా! ఇకనేను ఈ భూమిమీద జీవించియుండు దినములు
సమీపమునకు వచ్చినవి. ఈ మూనాళ్ళైన తిరిగి వెళ్ళక
ఇచ్చటనే ఉండుము. నేను పోయినవెనుక మరల మీ ంచ్చ
వచ్చినట్లు" అని చెప్పుచున్నంతలోనే కరాళి బండిదిగి లోనికి
వచ్చి సుగుణమణి ప్రక్కనే కేశవుడు కూర్చుండుటయు, ఆయ
న మెడను ఆమె పెనవేసి ఏడ్చుచు సంభాషణములు సలుపు
టయు, చూచి సహింపలేక, ఒళ్ళుతాపమెత్త గుర్రుర్రుజేసి
కొని మొగము చూచుకొని, "నీ భార్యమీద ఇంతప్రేమ
యుండిన ఇచ్చటనే పడియుండుము; నాయింటికిరానేల,
గబ్బువాసనతో కుక్కి మంచమున పడియున్న మనిషిని
ముట్టుకొన నీకెట్లు చేతులొచ్చినవి? గుడిసెలోదూరి యింతసే
పుండగలవాడు నాయింటికిరా వీలులేదు. ఛీ! అయిదు నిమి
షములలో వచ్చెదనని చెప్పి యింతసేపు కూర్చుంటివి, నీకు
సిగ్గులేదు? మళ్ళీచూచబోతే పెద్దమనిషట, పెద్దమనిషే,
మనిషే ఛీ," అనుచు ఇట్లు అనేకదుర్భాష లాడుచున్నను'

కేశవుడు వారించుటకు బదులు, వేశ్యాస్త్రీకి కోపమెక్కడ ముదురునో అను భయముతో, భార్యచేతులు వదిలించుకొని చివాలునలేచి, మొగము చిన్నబుచ్చుకొని, "ఇక మనము వెళ్ళెదమురా" అనెను. కాని ఆదుష్టమతి అప్పటికైన వూరకుండక, "అయ్యో! నీవు వెడితే యీ పాచిపని చేసేవారెవరికక్కడ? ఉండు, ఆవడమొందుకు?" అని ఇట్లనుచుండెను, ఇంతలో దాని పాపనేత్రములు గదిలో ఎదురుగ వ్రేలాడ తీయబడిఉన్న రెండుపటములపై పడెను, ఆరెండును సుగుణమణి తల్లిదండ్రుల ప్రతిమలు. ఎంతో కష్టపడి ఎట్లో పదిరూపాయలు ఖర్చుచేసి అ రెంటికిని వారిద్దరిమీదనుండు గౌరవముచే, రెండు చిట్టమైన అతిసుందరమైన విలువగలిగిన చట్రములు కట్టించెను. కరాళి ఆ చట్రముల హారింపనుద్దేశించి "ఇట్టి చక్కని చట్రములో నిట్టి వెలవెలబోవు బూడిదబొమ్మలను చూచుట ఇదియే మొదటిపర్యాయము, ఇంతచక్కని పనివాడితనము గలిగిన 'ఫ్రే'ములో నీపాడుప్రతిమలనుంచుటకు చేతు లెట్లు వచ్చినవి! ఇంతచక్కని యీ ఆడమనిసి, మొగమనిసి ఎవరని కేశవుని అడుగ అతడు "ఈమె మా అత్తగారు, ఆయన మా మామగారు అని జవాబు చెప్పెను."

అంత నాయింతి అతినీచబుద్ధితో, "ఆహా! ఏమి యీ చక్కదనము! మార్చుచే నాకండ్లుకూడ మూతలుబడుచున్నవి. చాలు! చాలు! ఈనాటికి చాలు. ఇకనైన ఆరెండు ఘటములను ఆవలపారవైచి చట్రములు చేతబట్టుకొని యింటికి

నడువుము. వాటిలో నాపాటోల నమర్చెదను" అనెను. కేశవుడందుకు సిద్ధపడుట చూచి, సుగుణ ఇంతసేపటినుండి సహించి యూరకున్నను ఇక దుఃఖము పట్టలేక, పసగుబలముతో లేచి భర్తపాదములు రెండును పట్టుకొని, "అయ్యో! ఆ గండి, రెండు నాళ్ళాగండినాయనా! తరువాత మీ యిచ్చ వచ్చినట్లు జేయవచ్చు" అని దీనాలాపములతో పలుకుచున్నను, కరాళిమాట దాటలేక, ప్రియురాలిని విసరికొట్టి, చేయి విదిలించి, పటముల రెంటిని అక్కడనేవిప్పి నేల పారవైచి, చట్రముల దీసికొని విటీవిటులిద్దరును వెడలిపోయిరి.

పాపము సుగుణ ఆ నాటికిక లేవలేక ఆబొమ్మల రెంటిని రొమ్ముననుంచుకొని ఆ దుమ్ములోనేపడి నిద్రించెను, పిల్లలును ఆమె ప్రక్కనే నేలపైపడి నిద్రించిరి. అయ్యో! దైవమా! ఎట్టి దురవస్థ సంభవించినది!

---

# సుగుణమణి

## తొమ్మిదవ పరిచ్ఛేదము.

మరునాడు ఉదయమున వైద్యుడువచ్చి చూచి, ఒక్క రాత్రిలోనే సుగుణమణికి అంతడస్సి రోగము అంత ఎక్కువగుటకు ఆశ్చర్యపడి, ఇంకొకటి రెండు రోజులకన్న ఎక్కువ

బ్రతుకదని నిశ్చయముగా తెలిసికొనెను. సుగుణయు ఆయన చెప్పకున్నను మున్దే గ్రహించెను. ఇద్దరును అనేక విషయములగూర్చి విశేషకాలము ముచ్చటించిరి. సుగుణ చెప్పి చెప్పి తుదకు "డాక్టరుగారూ! నేను ఎలాగూ పోయెదను. నాకు ఆధిగులు లేదుగాని పిల్లలమాట తలచుకొన్నప్పుడెల్లను గుండెలు ఝల్లుమనుచున్నవి, నా చేతులు శీతలములయ్యెను. నాకింక గడువు ఒకటి రెండు దినముల కంటె ఎక్కువలేదు. ఇదినాకు స్పష్టముగా తెలుసును. కాని యీ పట్నవాసములో మూడవ అంతస్తున నున్నవారు రెండవ అంతస్థున ఉన్న వారిని ఎరుగకుండ వాసము చేయుచుందురు. ఒకరి సంగతి ఒకరు విచారించుకొనుటకైన అవకాశములేక ఎవరి పనిమీద వారు పరుగెత్తుచుందురు. ఎవరికి వారే యమునా తీరే అన్నట్లు ఒకరిజోలి మరిఒకరికి అక్కరలేదు! ఇట్టి సందర్భములో నాపిల్లలకు ఇంతగంజి కాచిపోయు దిక్కెవరునాయనా?" అని అనేకవిధముల చెప్పినదే చెప్పుచు విచారపడెను. పాపము పిల్లలమాట తలంచినపుడెల్ల ఆమె దుఃఖమాగదు, నేత్రద్వయమునుండి నీరు జలజలమనిజారు డాక్టరుగారు కూడ ఆపుకొనలేక లోలోపల కుందుచు దుఃఖించిరి.

ఇట్లు ఇంతసేపు ఇద్దరును మాట్లాడుకొనిన తరువాత సుగుణ తన తండ్రిగారు పిల్లల పేరుతో వేరుగా వ్రాసియిచ్చిపోయిన వీలునామాను తీసి అందు వారి ముగ్గురికిని కలిసి పదున్నైదువేల రూపాయలనిచ్చి వెళ్ళినట్లు చూపించెను. సుగు

ణ ఎంత సుగుణ పుంజములకు పుట్టినిల్లో, వ్యవహార విషయ ములలోను అంతకంటె ఎక్కువ చాకచక్యము కలదియేయని, ఆ నగదును వడ్డీసహా పదిలముగా చేర్చి గవర్నమెంటు పత్ర ముల రూపమున నిర్భయముగ నుంచుటయే అందుకుగుర్తు. సామాన్యజనులవలె పిల్లలసొత్తు తనదే అనుకొని తినివేయక, అందు ఒక్క దమ్మిడియైనను ఆమె అంతవరకు ఖర్చు జేసికొన లేదను మాటయే ఆమె అద్భుతమగు సచ్చారిత్రము గలదని లోకమునకు చాటుచున్నది. ఇదిగాక ప్రత్యేకముగా తన నిమి త్తము తండ్రియిచ్చిన రొక్కములో పొందికగా వాడుకొని యింకను అయిదు వేల రూప్యముల దాచియుంచినట్లును చెప్పి చూపించెను.

డాక్టరుగారు పిల్లలముగ్గురిని తన యింట నుంచుకొని తనపిల్లలవలె చూచుచు, విద్యచెప్పించెదనని వాగ్దానము చేసె ను. ఆమాట వినినతోడనే సుగుణ మణకి ఒక పెద్దదిగులు తగ్గి పోయెను. ఇక నిశ్చింతగ భగవన్నామస్మరణ జేసికొనుచు చావవచ్చుగదా అను ధైర్యముతో ముఖము వికసించెను. ఇక తనముగ్గురు పిల్లలును దిక్కులేని అనాథలవలె వీధులలో తిరుగక, అంతు పొంతులేని మహాసముద్రముమీద తెప్ప కొయ్యనాధారము చేసికొని అడుగడుగునకు మునుగుదు మను భయముతో ప్రాణములు గుప్పిట పెట్టుకొని యూదు నిర్భాగ్యులవలె ఆ విశాలమైన పట్నవాసమున తన బాలు రిలక దిగంబరులై యుంటతటస్థింపక, ఒడ్డున బడిరను ఆనంద

ముతో నెత్తురులేని ఆమె మోము ఒక్క నిమిషము చంద్ర బింబమువలె వికసించెను.

తన సొంత రొక్కమునుండి డాక్టరుగారికి కొద్దియో గొప్పయో ముట్టజెప్పవలెనని సుగుణమణికి కోరిక ఉన్నట్లు తెలిపెను గాని ఆయన అందునకు ఒప్పుకొనలేదు. చివరకు ఆమె ఆ ఐదు వేలరూకలను తన పెనిమిటి పేర వ్రాసి ఆ 'విల్'ను డాక్టరుగారి చేతిలోపెట్టి, కేశవుడు బాగుపడనంత వరకు ఏమియు ఇయ్యక, ఆయన దుర్మార్గమును వదలి కొంచె ము సన్మార్గమునకు తిరిగిన వెంటనే అంతయు ఇచ్చివేయవల యునని చెప్పెను. డాక్టరుగారు కేశవుని విషయమై సమస్తము ను ఎరిగి ఉండుటచే ఆనరపిశాచమునకు ఏమాత్రమును ఇచ్చు ట ఆయనకు ఇష్టములేనట్లు తెలిపెను గాని, వెంటనే సుగుణ తన భర్త మొదట సుగుణ వంతుడనియు అతిదయాశీలుడని యు, కొన్ని వత్సరములకిందట సుగుణ పుంజములకు ఆట పట్టై యుండెననియు, ఇప్పుడు తన దురదృష్టవశాత్తు కాల వశమున దుర్మార్గుడైనను తిరిగి కొన్నాళ్ళలో బాగుపడునని తనకు గట్టి నమ్మకము గలదనియు, ఇట్లనేకవిధముల చెప్పె ను. అదియుగాక కేశవుని చూచినపుడెల్ల అతనిని దుష్టుడని అసహ్యించుకొనక సన్మార్గునిగచేయ బ్రియత్నింపవలసినదని కూడ డాక్టరుగారిని బతిమాలుకొనెను. ఈ సూచనలో మన మొక గొప్ప నీతిని నేర్చుకోవలసియున్నది. ఈకాలములో సా ధారణముగా కొంచెము ఆంగ్లేయవిద్య నభ్యసించిన వారందరు

కూడ తామెంతో ఘనులైతిమను నుద్దేశముచేతనో లేక ఏకారణముచేతనో, త్రాగుబోతులను చూచినను, కొంచెము చెడుదిరుగువారిని చూచినను లేక, వేశ్యకన్యలను బొడగాంచినను ఒకింత అసహ్యమును చూపింతురు, వీరికంటె తాము సన్మార్గులమని యా! ఈ విషయము సందేహాస్పదమైనది? ఏలయన అట్టి కష్టములలోగాని ప్రలోభములలో గాని తామును చిక్కనప్పుడు అంతకంటె దుర్స్థితి పాలుగాకుండిరేని అందుకు మనము సంతసింపవలసినదే! త్రాగుబోతు ఎప్పుడును త్రాగుడు గొప్పదని త్రాగడు. వ్యభిచరించువాడెప్పుడును వ్యభిచారము శ్రేష్ఠమని వ్యభిచరింపడు. త్రాగుబోతులకును వ్యభిచారులకుకూడ తాము చేయుపనులు కూడనివని తెలియును. తెలిసియును మనసు నిబ్బరము లేమిచేత తమ యిష్టములకు వ్యతిరేకముగనే నడచుచుందురు. వేశ్యలుసహా తమ వృత్తి అనాదికాలమునుండి వచ్చుచున్నదనియు తాము దేవదాసులమనియు నెన్ని చెప్పినను లోలోపల తమ నీచత్వము నెరింగియే యున్నారు. ఎరిగియుందురేని వారట్లెందులకు చేయుచుందురని, మా పాఠకులడిగెదరేమో? చేయగూడదనుకొనిన పనులను అనుదినమును మనమెన్ని చేయుటలేదు? ఇదిమానవుని దౌర్బల్యము, కాన త్రాగుబోతులను, దుర్మార్గులను, వేశ్యలను, బాగుచేయదలచుకొన్న యెడల అట్టి వారిని బహిష్కరింపక వారలకు మంచిత్రోవను చూపుటయే మన పని, ఈ విషయమున "రక్షకసైన్యము" వారు మిక్కిలి ఎన్నతగిన ఘనకార్యము నొనర్చుచున్నారు. దీనిని బట్టి మన సుగు

ణ ఎట్టి సమయోచిత జ్ఞానము కలదియో మాచదువరులే గ్రహింతురుగాక! ఈ మాటలన్నియు విని డాక్టరుగారు అత్యాశ్చర్యమునొంది భర్తఎంత దుర్మార్గుడైనను ఆయన మీదనున్న అట్టి ప్రేమకు మెచ్చుకొనుచు ఆయనను మంచిత్రోవకు త్రిప్పయత్నింతునని చెప్పి నమ్మించి, పిల్లల పేరనున్న పదునైదువేల రూప్యములను వారి చదువుక్రింద ఖర్చు పెట్టక విద్యతానే చెప్పించి పెద్దవారైన తరువాత రొక్కము నిచ్చెదననియు కూడ చెప్పి అప్పటికి వెళ్లెను.

బాలురభారము డాక్టరుగారు వహించుటచే సుగుణకొక పెద్ద దిగులు పోయినదని ఇదివరకే చెప్పియుంటిమి. ఆ సంతోషముచే భారము తగ్గుటయెగాక తనరోగమును ఇంచుక శమనము నొందినట్లుండుటచే కొంచె మోపిక చేసికొని లేచి కేశవునకు యీలాగున మరియొక ఉత్తరము వ్రాసెను:—

కేశవా, జీవితేశ్వరా.

బహుశః యీవుత్తరము మీకు చేరునప్పటికే నేను ప్రాణము విడువవచ్చును. ఇకమిమ్ము చూచు భాగ్యము లేదు కాని, రేపు నేను పోయినవెంటనే యీపిల్లలు ముగ్గురును అమ్మా, అమ్మా, అనుచు నేలబడి కావు కావున ఏడ్తురు. అప్పుడైన మీరు ఒకమారువచ్చి కొంచెము ఎత్తుకొని ఓ

దార్చి వెళ్ళితిరేని వాండ్రకు తిరిగి సగముప్రాణము రాగలదు. మిమ్ములిని చూచిన వాండ్రకు కొంతధైర్యము గలుగును నేను ఆఖరునిమిషమునందు కోరిన యీకోర్కెనైన నెరవేర్తురని నమ్ముచున్నాను.

ఇట్లు,

నీప్రాణేశ్వరి,

సుగుణమణి

ఉత్తరము వ్రాసి పంపివేసి సుగుణమణి మిక్కిలి సంతోషముతో పిల్లల నాడించుచుండెను. నలుగురును కలసి కొంతసేపు కథలు చెప్పుకొనిరి. నవ్వుకొనిరి. ఏవియో ఆటవస్తువులతో పందెములు వేయుచు నాడుకొనిరి. సుగుణ యిక తనప్రాణము ఘంటలలోనున్నదని గ్రహించి బాలుర నానందింప జూచుచుండెను. ఈదినము అన్యదినములవలె గాక తల్లి తమతో ఆడుచు, నవ్వుచు, వినోదములు సల్పుచుండుట చూచి ముగ్గురు పిల్లలును పరమానందభరితులైరి. కొంత ఆడినపిమ్మట సుకుమారుడు ఇట్లనియె. "అమ్మా! ఇక నీవు ఏడ్వకమ్మ. ప్రతిరోజు యిలా మాతో ఆడుకోరాదా !"

ఆమాటలువిని సుగుణ ఇట్లని అడిగెను. "ఏమీ ? నేనువడిస్తే నీకేమి కష్టం నాయనా ?

సుకు—కష్టమా ! నాకూ కష్టంగానే ఉంటుంది,

తమ్మునికి కష్టంగానే ఉంటుంది, బుల్లితమ్మునికీ కష్టంగానే ఉంటుంది. నీవు ఏడిస్తే వాళ్ళూ యేడుస్తారు. నేనూ యేడుస్తాను !

సుగు—ఇక నేను ఏడవనుగాని మీరుకూడా యేడవరు గద ?

సుకు—ఉ ! యేడవంలే.

సుగు—వాళ్ళిద్దరూ యేడిస్తే నీవు ఓదారుస్తావా ?

సుకు—ఆ ఓదారుస్తానులే.

సుగు—రేపు మిమ్మల్ని ముగ్గుర్నీ డాక్టరుగారు వారి యింటికి తీసుకు వెళుతారు, వెళుతారా ?

సుకు—నీవు రావూ మరి ?

సుగు—ఉహూ ! రాను.

సుకు—అలాఅయితే మేమూ వెళ్ళము.

అంతవరకు జరిగిన తరువాత సుగుణ ఒకనిట్టూర్పు విడిచి తిరిగి, "ఎవరికోసరము వెళుతారు నాయనా ? వెళ్ళకపోతే తప్పుతుందా కాని అక్కడికి వెళ్ళి ముగ్గురూ దెబ్బలాడుకోకండి! వాళ్ళిద్దర్నీ ఆడిస్తూండు ఎప్పుడును !" అని చెప్పెను.

సుకు—మళ్ళీ ఎప్పుడు రాము ! నీకుమళ్ళీ కాళ్ళు పట్టవద్దు నేను !

సుగు—రేపు ఇక నాకు కాళ్ళతీపు ఉండదు, జబ్బూ ఉండదు. మీ తాతగారిని చూడడానికి రేపు నేను వెళ్ళి పోతాను!

సుకు—మే మెక్కడ ఉండము?

సుగు—తమ్ముళ్ళిద్దర్నీ పెట్టుకొని డాక్టరుయింట్లో ఉండు డాక్టరుగారూ, డాక్టరుగారి భార్యా మిమ్మల్ని ముద్దె ట్టుకుంటారు. మీకు అన్నీ యిస్తారు. ఏమిభయం లేదు. ఏమి నాయనా?

సుకు—"అమ్మా! నీకు దణ్ణము పెడతాను, మమ్మ ఎను ఒదిలిపెట్టి వెళ్ళబోకమ్మా! మేము ఉండలేమమ్మా" అనుచు ఏడ్వసాగెను. ఈతని ఏడ్పుచూచి పిల్లలిద్దరును ఏడ్చుచుండిరి. ఇదిఅంతయుచూచి సుగుణ తిరిగి ధైర్యముతగ్గి తానును ఏడ్చు చుండెను. తిరిగి ఒళ్ళు పులకరించెను.

రెండురోజుల క్రితము కేశవుడు వచ్చినపుడు అతనిని కౌగలించుకొని సుగుణ తాను జీవించుదినములు అంతము కానున్నవనియు, ఆమూన్నాళ్ళైన తనవద్దనే ఉండుమనియు బతిమాలుకొనుచు ఏడ్చుట మనమిదివరకే చదివియున్నాము. అదిగాక ఆమెమాటలకు లక్ష్యముచేయక తనప్రాణము కన్న ఎక్కువప్రేమతో కాపాడు తన తల్లిదండ్రుల పటము లను కేశవుడువిప్పి పారవైచి చట్రముల చేత పట్టుకొని

వేశ్యవెంట పోయిఉండెను, కాని, ఆనాడు వారకాంత ఎదుట తన మర్యాద నిలుపుకొనుటకై అట్లొనర్చియుండియు, సుగుణామణి, మాటవినక, ఆమెవద్ద మూన్నాళ్ళుండుటకైన ఒప్పుకొనక, అత్తమామల పటముల బెరికి పారవైచునంతటి దౌర్జన్యము ఒనర్చినది మొదలు ఆయనకు మనశ్శాంతి లేక గుండెలు కొట్టుకొనజొచ్చెను. అయ్యో! వేశ్యకు వెఱచి మూనాళ్ళ ముచ్చటయైన దీర్చలేక పోతినిగదా! అని ప్రాణము లోలోపల తపించుచుండెను. ఇల్లుచేరునప్పటికి వెర్రెత్తినట్లుండుటచే వెంటనే ఉదరమున నింత మద్యముపోసి నిద్రించెను. కాని ప్రతిరోజు ఈయన అవస్థ కృష్ణపక్షు చంద్రునివలె అడుగంటుచుండెను. రెండవనాడు రాత్రికూడ అంతరాత్మ ఆవేదన సహింపలేక పూర్తిగ త్రాగి శయనించెను. అయినను మఱునాడు లేచునప్పటికి వెనుకటి సంగతులన్నియు జ్ఞాపకము వచ్చెను. ఒకటి వెంటనొకటి తాను అతిబాల్యావస్థలో నుండగ రాజారావుగారు దగ్గరకుదీసి, ఆదరించి పెంచి విద్యగఱపించి తన కుమార్తెనిచ్చి వివాహముచేయుటయు, కొన్ని సంవత్సరములు తానును తన ప్రియురాలయిన సుగుణయు సుఖముగ చిలుకగోరవంకలవలె కాపురముజేయుటయు, తరువాత దురదృష్టవశమున మద్య మలవాటై వేశ్య గృహముచేరుటయు, తానిప్పుడు పశువుకన్న అధమరీతిని కాలముగడపుటయు అన్నియు స్మరణకువచ్చి, దేహము తాపమొంది కంపించుచుండెను, ఇట్టి అవస్థలో సుగుణవ్రాసిన కడపటి ఉత్తరము చేతికందెను. చింపి చదువుకొనెను, పిచ్చివానివలె

అన్నియు మఱచిపోయి, లోకమునే మరచి అరాత్రుగా మం చముమీదనుండి లేచి ఎవరికి చెప్పక కాళ్లజోడు వేసుకొనక చొక్కానైనా ధరింపక. తుదకు ఉత్తరీయమును పైవైచుకొ నుటకూడ మరచి ఊర్ధ్వశ్వాసముతో పరుగిడుచు సుగుణ ప్రాణము పోవుచున్న సమయములో తొందరగా వచ్చి ఆమె పాదములవద్ద వెట్టిగొల్లవానివలె నేల కూర్చునెను.

సుగుణమణి అంత్యకాలము సమీపింపగా కన్నులు మూసుకొని శ్రీహరి నామము జపముజేయుచు, ఈశ్వరుని ఇట్లు ప్రార్థనసేయజొచ్చెను.—ఓపరాత్పరా, పాపహరణా దయార్ద్రహృదయా! ఈపాపిమీద కరుణయుంచి నాపాప ముల హరించి ముక్తినిమ్మా. ఇదిగో ఈముగ్గురు పిల్లలను కాపాడుము. చెడుమార్గమున తిరుగుచున్న నాప్రియభర్తను సన్మార్గముకుదెమ్మా!"—అనుచుండగా సుకుమారుడు అమ్మాయని పిలిచి, ఇదుగో నాన్నవచ్చెనని చెప్పెను. సుగుణ మణికి ఆమాటలు అమృతధారవలెదోచి "ఏరా; పిల్చుకరా నాన్నని: ఒక్కమాటు నాపక్కను కూర్చొనుమని చెప్పు!" అని తడబడు మాటలతో నుడివెను.

అంత వెంటనే కేశవుడు జరిగి కుడిప్రక్కన కూర్చుండి ఆమె రెండు చేతులును పట్టుకొని, సుగుణా! ఇదిగో వచ్చి నాను, ఇంకను నిన్ను వదలివెళ్ళను. నన్నును నీవు వదలి వెళ్ళకుము." అనెను! ఆమె కళ్ళువిప్పిచూచి భర్తకనులవెంట

నీరు గారుచుంటచే సహింపలేక చీరకొంగుతో తుడువబోయెను, గాని చేయి లేవలేదు. అటుపిమ్మట సుగుణ "కేశవా! రెండు దినములకింద టఏల ఉండలేదు? రెండు దినముల క్రిందట ఏల యిట్లుచెప్పలేదు? అట్లయిన నేనిప్పుడును చచ్చుదాననుగానే! ఇప్పుడిక జీవించు ఆశలేదు, కాని పిల్లలున్నారు, జాగ్రతగా కాపాడుము" అని అంత్య వాక్యములు చెప్పుచుండగనే నేత్రములు మూతలుబడెను. కేశవుని కనులనుండి జొటబొట నీరు గారగా ఏడ్చియేడ్చి చివరకు "సుగుణా! ఇంకొక్కమాటు కన్నులు విప్పిచూడు! ఈ పాపాత్మునికి ప్రాయశ్చిత్తము జెప్పి మఱివెళ్ళు"మని మిక్కిలి ఏడ్చెను. సుగుణ ఎట్లానో మరి ఒక మారు చూచి, భర్త రెండుచేతులును పట్టుకొని, "కేశవా! ఇక నేనేమిచెప్పను? ఇకనైన పూర్తిగా మద్యపానము చేయుట మానుదురని నాకోరికయు ప్రార్థనయు. మిమ్ము నేను సుఖ పెట్ట లేకపోతిని. మీకు యిష్టము ఉన్న యెడల తిరిగి వివాహము చేసుకొనుడు. కాని ఆమెనుకూడ యిట్టికష్టములను పెట్టవద్దు. ఇదియే నేను చెప్పగలిగినది" అనెను, కేశవుడు విని అనేక పర్యాయములు కుళ్ళి కుళ్ళి ఏడ్చుచు తనదుర్మార్గములను మన్నింపవలసినదనియు, తనను క్షమింపవలసినదనియు, వేరు విధముల బతిమాలుకొనెను.

సుగుణ బలవంతముగా ఇంకొకమాటు కనులుదెఱచి, మొదటి యిద్దఱి పిల్లలను ఎడమ ప్రక్కన కూర్చుండ నియమించి కనిష్ఠుని గుండెలిమీద ఎక్కించుకొని ఎన్నియో మా

ములు ముద్దుబెట్టుకొని, భగవంతుని స్మరించుచు పిల్లల ముగ్గురి కుఱ్ఱల నాశీర్వదించి, కేశవుని చేతులలో గాని ముగ్గుర చేతులనుంచి, "కేశవా! నాపనియైనది. నేను చేయు గల కార్యముల జేసితిని. ఇదిగో మీకుమారుల మీకొప్పగించు చున్నాను. చక్కగా విద్యచెప్పించి కాపాడుము" అనుచు మాటదప్పి ఆమె నేత్రములు మూతబడియెను. ఇదియే ఆమె కడసారి దృష్టియు మాటయు తరువాత పిల్ల లెంతయో ఏడ్చిరి, "అమ్మా! మాట్లాడవే! అమ్మా! పలకవే!" అని యేడ్చిరిగాని, ఇక నెంతయేడ్చినను లాభము లేదుగదా, హా ఈశ్వరా, పరమేశ్వరా!

డాక్టరుగారికి వర్తమానము పెళ్ళగా ఆయిన అజ్ఞప్రకారము ఆమె మృతదేహమును సముద్రపుటొడ్డున దహనము జేసిరి. నిమిషములో పంచభూతాత్మకశరీరము పంచభూతము లలో గలసిపోయెను. హా! సుగుణమణీ నీవంటి సుగుణవతిని కనివిని ఎరుగను, నీవంటి సుగుణమణు లెందరో జన్మించి ఈ దేశమును, నీదేశీయులను పూత చారిత్రముచే ధన్యులను చేయుదురుగాక!

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

హరిః ఓం.

సంపూర్ణము.